# శ్రీ మహాభారతము: వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

### 18 పర్వములు — 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భా॥ | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భా॥ | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణపర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| ఆనుశాసనిక పర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, | | | | 0 |
| స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తి సెట్టు వెల 37—8—0

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి

# డాక్టరు ఖాన్ సోదరులు

[ జీవిత చరిత్రలు ]


రచయిత:

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారు





ప్రకాశకులు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1955

[ వెల 0—12—0

# భూమిక

"భౌతికాధ్యాత్మిక ప్రభాభాగ్య మొక్క-
భరతజాతికిగాక యెవ్వరికి గలదు ?"

జాతీయసోదరులారా !

భారతదేశ మధ్యాత్మిక భౌతిక విజ్ఞానమునకును, తద్విజ్ఞులకును పుట్టినిల్లని పాశ్చాత్యదేశములందలి యెందరో విజ్ఞాన ప్రతిభాశాలురు, మేధావంతులు, మనీషావంతులు నంగీకరించియున్నారు. అది యట్టిదయని జగమెఱుంగును. కాని యీనాడా శక్తిస్వరూప మెం దడగిపోయినది ? పర పాలనా రథచక్రము క్రిందబడి నలిగిపోయినదా ? భారత దేశ మునకనే యెందో మాటువడినదా యని శంకించుకొన్న ప్రత్యుత్తరము చెప్పుటయే కష్టము. ఏమైననేమి మనకు లేదు. అయితే 60 ఏండ్లనుండి భారతదేశమున జరుగు సంభ్రమచిహ్నము లేమి ? దీనిఫలిత మేమి ? అని ప్రశ్నించు కొనినచో రవంత సమాధానము లభింపవచ్చును ? లాభ మేమి ? అట్లని ఉపేక్షింతుమా ? ఉపేక్షించితిమా ? పెద్ద లూరకుండిరా ? ఈ జతనమంతయు దానిసంభ్రమమే. దాని వలన చేకూరిన లాభము నేటికి భారత రాజకీయరంగమున విజృంభించిన శక్తులే వాని నుద్ఘాటించుచున్నవి. అయిన

నేమి ? సహజూరుకు మాతృదేవికి సర్వస్వ మర్పించుట విధాయకముగదా ? అట్లే భారతపుత్రులు పలుభాగల సం దుచు కర్తవ్యతాసాధనలు చేయుచుండిరి.

భారత రాజకీయరంగమున నెప్పటి కప్పుడు స్థితి గతులు పరిణామ మొందురీతిగనే నూతననాయకులు బయ ల్వెడలి బహుపరిణామదశలను దెచ్చుచున్నారు. సంతోష సాగరమున నీదులాడ తగినదే ? భారతదేశమున నిపుడు చెలరేగిన యీ మత వైషమ్యము రూపుమాపు విధాన మెయ్యది ? ఇది కేవలము హిందూ ముసల్మానులలో కరుడు గట్టుకొన్న ద్వేషరాశే అంటున్నారే గొందరు. ఇది విశ్వాస నీయమా ? ఎంతమంది ముసల్మానుసోదరులు మనకు సోదరు లుగావుండి మనప్రక్క జీవిస్తూ మనతో చేతులుకలిపి భారతదేశ దాస్యశృంఖలముల విడగొట్ట యత్నించుటలేదు. ముసల్మానుల నావిధి తూలనాడి యుభయుల యశఃప్రతిష్ట లకును భంగము గలిగించుకొన వచ్చునా ? మన పరిసరముల నివసించు ముసల్మానుసోదరుల మాటకేమి ? ఎచ్చటనో సరి హద్దురాష్ట్రములలో నున్న యొక ముసల్మాను కవలను మీాయెదుట బెట్టుచున్నాము. వారి జీవిత విశేషములను తీర్చిదిద్ది మీా హస్తపద్మముల నలంకరించు చున్నాము. దానిని పరిశోధనాదృష్టితో, పవిత్రభావముతో బరికింపుడు. ఎన్నిసంవత్సరములు మనపూర్వులు మహమ్మదీయ పరిపాలన ములో గడపిరో తెలియునా ? ఇంచుమించు ఏడువందలేండ్లు

సుమా ? ఆకాలములోని ముసల్మాను చక్రవర్తుల పరిపాన పద్ధతులను పరికించండి. స్వారాజ్యము రామరాజ్యము. అక్బ్బరారాజ్యము దేవరాజ్యము. అట్టి మన సోదరులతో కలహించుటా ? వారే కెలికి కలహములను పెంచుతున్నా రన్నా యింత శీఘ్రగమనం వారికి ఏలకలిగింది. అంచేత మన ముపేక్షింపరాదు.

సరిహద్దురాష్ట్రములో విశాల విజ్ఞానపరిణతికి మూల కంఠము లనందగు ఖానుసోదరుల చరిత్రము పవిత్రతమము-పూజ్యతమము-నై యున్నదని ఋజువుచేయుట కీగ్రంథము నందు వారి సంపూర్ణ జీవితాంశములను లభించినంతవఱకు చేర్చి ముద్రించితిమి. కాంగ్రెసు నాయకుల చరిత్రలను నింతకు మున్నెన్నిటినో ప్రచురించియుంటిమి. ఈ జీవితమును గూడ యథాపూర్వకముగ భారతీయు లందరును నాదరింతు రని విశ్వసించుచున్నాను.

ఇట్లు,

ప్రకటనకర్త.

౧

# ప్రస్తావన

"ప్రాణిలోకంబు సంసారపతిత మగుట
వసుధపై గిట్టి పుట్టనివాడు గలడె?
వానిజన్మంబు సఫల మెవ్వానివలన
వంశ మధికోన్నతి వహించి వన్నెకెక్కు"

ప్రపంచమందు ప్రాణికోటికంతకు తొలిజన్మంబునందలి సుకృతదుష్కృత కర్మవశమున నే పుట్టుక గల్గుచున్నదను సంగతిని నేటిప్రపంచమందలి మతము లన్నియు నంగీకరించిన విషయమే. అయినను ప్రతిప్రాణికి మానవజన్మ లభియించుటయే దుష్కరము. అట్టిపుట్టుక లభించినందుల కావ్యక్తి యెంతయు నానందమందుచు సద్వర్తనుడై, పరోపకారపారీణుడై, త్యాగియై, దేశసేవాదురంధరుడై మనుగడ గడిపినప్పుడే యాపుట్టుక ధన్యతమంబగును. అట్లుగాక దుర్నడత లలవఱచుకొని, దుస్సహవాసములజేసి దుష్టవర్తనుడై దుష్కర్మంబుల నొనర్చుచు సుకృతమన నెట్టిదియో, పరోపకారమన నేమో, త్యాగరూప మెట్లుండునో యెఱుంగక ఆహారనిద్రాభయమైథునాదికములకే జన్మించితి మను వానిపుట్టుక యిహలోకమున దుర్భరమై, పరలోకమున పాపహేతువై పాపకూపమున బడును.

ఇది యేనాటిమాటలో ఎప్పటిపుక్కిటిపురాణములో, ఏనాటినుండి బూజుగట్టి దులిపి దుమారముదాల్చి బయలు పెట్టిన యంశములని దూషింపజనదు. మనయెదుట నేడు ప్రత్యక్షముగ సాగెడి మానవుల న్యూనతాధిక్యతలును, కలిమిలేములప్రాప్తియు ముఖ్యముగ నవి వానిచాయలే. ఒక చోటనే గర్భదరిద్రుని, నిరంతర భోగభాగ్యానుసంధాయకుని జూచుచున్నాము. ఒకకడుపుననే జన్మించి సజ్జనదుర్జనులుగా పరిగణింపబడువారిని కనుచున్నాము. అయితే మానవుడు తనజన్మసాఫల్యమునకు చేయుక్రియలలో మానవసేవయొకటి. ఆసేవలో నాత డెంత యౌదార్యమును, త్యాగమును, ఓర్మిని జూపునో యంతగా రాణించుననుట నిక్కవము. మహాత్ముడు ముఖ్యముగువారు కొందరు ఆ తెగకు జెందినవారే.

మానవసేవలో మగ్నులగుటకు జాతిమతములతారతమ్యము, ఎక్కువతక్కువల పరిశీలన, ధనదారిద్ర్యభేదము లనవసరములు. ధర్మాధర్మవిచక్షణ, న్యాయాన్యాయపరిశీలన, దుష్టశిక్షణ, శిష్టరక్షణాదికముల యావశ్యకత ప్రధానావలంబనములుగా నుండవలెను. మన దేశమున నట్టివారు కొద్దిగనో, గొప్పగనో అన్నిమతములవారిలోను, అన్ని జాతులవారిలోను నున్నారు. వారుమాత్రము దేశసేవను, మానవసేవను ముఖ్యముగా గమనింతురుగాని యన్యమును జూడ నొల్లరు.

అట్టి మహోదారులలో లెక్కింపదగినవారును సరిహద్దు రాష్ట్రవాసులకు వెన్నెముకవంటివారై యెట్టి పదవీవ్యామోహమును లేక ప్రజాసేవకే తమ మానధన ప్రాణముల నర్పించి పలువిధంబులయిన బాధలనంది నేటికి నందుచు స్వరాష్ట్రమందే గాక యన్యరాష్ట్రవాసులచే గూడ బొగడ్తలందుచు విభజించి పాలించు ప్రభువుల పాలిటికి ప్రక్కలోని బల్లెమై చెక్కుచెదరని గంభీరహృదయులై జంకుగొంకు లేని నిష్పక్షపాతులై నిరవధిక దేశసేవాముద్రితహృదంతరంగులై వెలయు ఖానుసోదరుల చరిత్రము నిపుడు పాఠకులు చవిచూడ నున్నారు. వారి ప్రాచీనవంశాచారనిష్పత్తి, మహాత్మసేవానిరతి, సర్వతోముఖప్రతిభ, అస్పృశ్యతానిర్మూలనకార్యక్రమము, అనుస్యూతమగు దేశసేవ, అనుపమానదైవచింతనము, అకుంఠితప్రవర్తనము, అమేయక్రమశిక్షణ మున్నగు పెక్కువిషయములందు గోచరింపగలవు. మఱియు నేటి మతద్వేష యనెడి మహామారి కేవలము బ్రిటిష్ పరిపాలకుల రాజనీతి చతురతయే గాని వేరొండు గాదని స్పష్టీకరణముగ సోదాహరణముగ పాఠకు లెఱుంగగలరు.



## సరిహద్దు రాష్ట్రప్రతిభ–జననము

"మొదల జూచిన గడుగొప్ప పిదప గుఱుచ
ఆది గొంచెము తర్వాత నధిక మగుచు
దనరు దినపూర్వపరభాగ జనితమయిన
ఛాయపోలిక గుజన సజ్జనుల మైత్రి."

భరతఖండము విశ్వప్రపంచమున కైకైకవిజ్ఞానఫలదం బని, వేదకల్పక ముద్భవించుట కాలవాలమని, సంకల్ప మాత్రంబుననే జగన్నిర్మాణమున శక్తివంతులగు తపోధనుల కాస్పదంబని, సత్యరతాది వ్రతదీక్షితులైన హరిశ్చంద్రాది షట్చక్రవర్తు లేలిన నవసభూమియని, పరశురామ ద్రోణపాండవేయాదులగు కాండీరపీఠులను గన్న వీరమాతయని, గాంగల హరీతరంగములచే సంక్షాళితం బగు మానవాళ్యఘపంకము గలదగు మహాస్యసీమయని, శంకరాది మతాచార్యులను జన్మభూమియని, భువనైకపావనం బని విశ్రుతప్రతిభావంతమని ప్రఖ్యాతి నందినది.

ఆ పావనభారతదేశసీమలో నొక ప్రకృతిరామణీయకతావిరాజమానమగు రాష్ట్రము సరిహద్దురాష్ట్రము. ఆ రాష్ట్రమునకు వాయువ్యదిశ నాకశమున నెట్టనిమచ్చవలె గోచరించును. అయితే 1930 సంవత్సరమునకుముందు దారాష్ట్ర

మును గూర్చి కొలదిమంది పత్రికాపాఠకులకునక్కఁ నన్యులకు గించిత్తయిన తెలియుదన్న నసత్యము కాదు. అజ్ఞుడు అవివేకి యైన అనాగరికు డొకడు సరిహద్దురాష్ట్ర మను దేశమున్న దని, ఆ దేశమునుండి హెచ్చువడ్డీలకు ధన మప్పుగా నిచ్చుచు పుచ్చుకొన్న వారిని పలుబాధలబెట్టు పఠాను వచ్చు ననియు, అతడు నిష్కరుణుడై వడ్డీతో ధనము లాగికొని యేకాకి మరల గన్పింపడనియు మాత్ర మెఱుంగునని చెప్ప వచ్చును. మన దేశమున నిపుడు అడుగడుగునకు విచిత్రవేష ముతో చూపునకే భయంకరులుగ గన్పట్టు వేలాదిమనుజులే యీ పఠానులు.

సరిహద్దురాష్ట్ర మిట్టిదని వర్ణింప నారంభించితిమా యిందు ముఖసీమను ముఖ్యముగా గోచరించునవి రష్యా విషయమునయి బ్రిటీషువారు భయసంత్రస్తులై గడగడలాడిన కథానిక దృశ్యములే. ఆరాష్ట్రము భారతదేశమునకు శత్రు వులరాపిడి కలుగకుండ పెట్టనికోటవలె యీశ్వర నిర్మితమై యుండును. బ్రిటీషుపాలకులు తమ కార్యావసరమునుబట్టి కొన్నిక్లిష్టపరిస్థితులలో నారాష్ట్రవాసులకు ధనాశజూపి తమ చెప్పుచేతలలో బెట్టుకొనుట పరిపాటయినది. బ్రిటిషువారు సరిహద్దుజాతులపై జరుగు దండయాత్రలనుగూర్చి చెప్పు నంశములలో నొక్కటియు నిజాంశ ముండదు. కాని పాలక జాతిలో వారి కేదైన ఆపద తటస్థించి నపుడు బలీయ.ములగు నారాష్ట్రముందలి శక్తులన్నియు దానికై వినియోగింపబడు

పని మాత్రము తేటతెల్లమగును. సరిహద్దురాష్ట్రములో 1930 నుండి జరిగిన కొన్నిసంఘటనలవల్ల నారాష్ట్రప్రాముఖ్యత దేశీయులకుగూడ వెల్లడియైనది.

ఆరాష్ట్రవాసులలో నూటికి నూరుమందికూడ శూరమ్మన్యులు, ఆత్మాభిమానులు, పట్టుదలలో దిట్టలు, పోరాటమున దీటుతీసినవారును. అసలు పఠానువంశమునకు నగ్నిలో అవయవములుంచి సాంతముగ కాలువఱకు బయటికి దీయనట్టి సాహస మాజన్మసిద్ధము. ఇందుల కెన్నియేని ఉదాహరణము లారాష్ట్రమునుండి చూపవచ్చును. కాని యత్యంత సాహసోపేత మగు నొకటి రెండుదాహరణములు చెప్పక తీరనిది చెప్పివినుతును. ఒక పఠానుడు ఆరితేరిన చోరవిద్యా ప్రతిభాశాలి యొక గృహస్థునింటికి దొంగతనమునకుబోయి కన్నమును త్రవ్వి యందులో తన దక్షిణహస్తమును జొనిపి లోనికేగు నుపాయము నన్వేషించుచుండెను. ఇంతలో నాయింటియజమాని మేల్కాని కన్నములోనిచేతి నట్టేపట్టుకొని ప్రాంతవాసులను గొంతెత్తి పిలువ మొదలిడెను. వెంటనే యాపఠాను తాను పట్టుబడుట నైచ్యమని భావించి రెండవచేతినున్న కృపాణముతో గన్నములోని తనచేతిని త్రుంచుకొని యాగృహస్థు విస్తుపోవునటుల మొండిచేయి నతనికి వదలి పలాయనమంత్రమును పఠించెను.

సుప్రసిద్ధ పఠానువంశీయు డగు 'హాజీసాహెనవాజ్ ఖాన్' అను నతడు దొరతనమువారిచే జామీనుసెక్షనుక్రింద 1930 సంవత్సరమున నిర్బంధింపబడెను. ఆతడుండి

విడుదలకావలెనన్న యందులకై నిర్ణీతమగు ధరావతు డబ్బును చెల్లింపవలయును. ఆత డెంత యాపదలోనున్నను ధరావతు చెల్లించి బయటపడుట కాతనికిగాని, ఆతనిబంధు కోటిలో నేయొకనికిగాని యిష్టము లేదు, ఆయనబంధుకోటి జామీనుశిక్షను నిరాకరించి మరల కారాగారమున కేగుట యే కర్తవ్యమని సలహానిచ్చిరి. తా నంతకుమున్న విడుదలై వచ్చి కుటుంబమునకు దెచ్చిన మచ్చను రద్దుచేయవలె నన్న తిరుగ కారాగారములో ప్రవేశించుట చాలదని, ఆత్మ హత్య చేసికొని మరణించెను.

ఇవ్విధముగ ననన్యలభ్యమాన సాహసోపేతులును, ధైర్యశాలురును నగు పఠానులకు జన్మభూమియగు నాసరి హద్దురాష్ట్రమున నొకగేస్తునింట 1880–90 సంవత్సరముల మధ్య రెండాణిముత్యములు పొడసూపినవి. ఆగేస్తు మహ మ్మద్ జయిజాతికి జెందిన బలీయుడు. వారిగృహనామములు ఖాన్ శబ్దప్రతిపాదితములు. ఖాను అనగా నాయకుడు. ఆయన నామధేయము 'ఖాన్ సాహేబు బెహరాంఖాన్' ఆయన జన్మస్థానము పెషావరు జిల్లాలోని చెరసద్దాతాలూకాకు చెంది పెషావరున కిరువది మైళ్ళదూరముననున్న 'ఉత్మా జయి' అనుగ్రామము. ఆగ్రామమునకు బెహరాంఖాన్ కిరీటములేనిరాజు. ఆప్రకృతిలీలా సదృశదృశ్యములతో విరాజిల్లు పల్లెటూరు చెరసద్దాకత్యంతపరిసరమున శాంతవేగమున ప్రవహించు స్వాత్ నదీతీరమున నత్యంతరమణీయప్రదేశమున

నున్నది. దానికి పశ్చిమదిశగ నిరునది మైళ్ళ వఱకు అఫ్ గన్ స్థానమున కేగుమార్గమున సరిహద్దురాష్ట్ర ప్రజానీకమునకు వన్నెకాసుల గల్పించువారగు 'మోహామద్' జాతుల వాస స్థానము లున్నవి.

ఇట్టి విచిత్ర రామణీయక ప్రతిభగల వాతావరణమున వసించు బెహరాంఖానుమహాశయుని గర్భమున జ్యేష్ఠపుత్రుడుగ డాక్టరుఖానుసాహెబు 1883 సంవత్సరములో, కనిష్ఠుడైన ఖాన్ అబ్దుల్ గఫ్ఫూర్ ఖాన్ 1890 లోను జన్మించిరి. వారు స్వభావసిద్ధముగనే ప్రకృతిప్రేమోపాసకులైరి. నవనాగరికతకునికిపట్టయిన మహానగరములన్న వారి కిష్టమే లేదు. ఇంకను పెషావరుమండలప్రాంతము ప్రకృతి సిద్ధముగ నుండెడి ఆచారవ్యవహారములు, రీతిరివాజులు, కొన్ని పలుకుబడులు హిందూతత్వమునే బోలియుండును. ఆప్రాంతప్రదేశములందు కొన్నిశతాబ్దులనుండి బౌద్ధమతమే యత్యంతప్రచారమున సుస్థిరమైయున్నది. బౌద్ధకాలమునాటి బహువిధములగు వన్నెచిన్నెల కామండలమే పెట్టినది పేరు. ఇప్పటికిని కొన్నిగ్రామముల పేళ్ళు హిందూబౌద్ధమతాంకితములుగ నొప్పుచున్నవి.

ఈ సోదరుల జనకుడు మిగుల సద్వర్తనుడు. ఆయన సుగుణసంపత్తినిగూర్చి చెప్పవలెనన్న అజాతశత్రుడే అనవలయును. కాని ఆయనకు శత్రువులు లేకపోయినను వారిబంధుకోటిలోనే ఆయనను శత్రువుగ భావించి పలువిధములగు బాధలను గల్పించి తుదకుబరాభూతులై పశ్చాత్తప్తహృద

యున్నైనవా రెందరో గలరు. పగయన్నను, పగతీర్చుకొనుట
యన్నను ఏమో ఆయన కెఱుకలేదు. మోసగించుటయే
అన్యాయముగాని మోసగింపబడుట అన్యాయము కాదని
ఆయనకు విశ్వాసము. ఆడినమాట నిలుపుకొనుటలో నపర
హరిశ్చంద్రుడు ఆ ప్రాంతమందిట్టి విజాతీయమనిషి లేడని
పేరొందినాడు. ఆయన సహాయముతో జూచువారుగూడ
నవసరమున్నను, లేనపుడునుగూడ నమ్మికతో నుందురు.
వందలాది పరిసరవాసు లాయనకడ ధనము దాచుకొని రసీదు
అడిగినవారు లేరు. సాహసమున నంతటివాడు లేడని ప్రతీతి.
జీవితాంతమువరకెట్టిసమయమందుగాని యొరులకడ చేయి
చాచుటగాని, అధికారుల ప్రాపక మార్జింప యిచ్చకములు
పలుకుటగాని యెరుగడు. అంతేగాక యెంతటి గొప్ప
యుద్యోగిగాని ఆయన పేరు చెప్పిన వణకుటయే. ఎందరో
బ్రిటిషుద్యోగు లాయనను 'బాబు'అని పిలుచుటయేగాక
ఆయన సమ్మతింపని కార్యమును జేయ యత్నించుటకు
సంకోచ మందుచుండెడివారు. ఆ ధన్యజీవనుని యిల్లాలు పతి
యడుగుజాడలలో నడచి భర్తవలెనే యాధ్యాత్మిక భౌతిక
విజ్ఞానము నెంతేని యార్జించి యించుక తీరిక యయ్యేనేని
నిశ్చలచిత్తయయి ప్రశాంతహృదయముతో ధ్యాననిమగ్న
యయ్యెడిది.

అట్టి విశుద్ధజీవనుల గర్భశుక్తిముక్తాఫలంబు లగు
ఖానుసోదరుల అంతరంగిక సుగుణజాలముల పరిమాణ మిట్టి

దని వచింప శక్యము కాదన్నను అనవచ్చును. బెహరాం ఖానుమహాశయునిగూర్చి మనము తెలిసికొనదగిన ప్రముఖ విషయ మొకటి యిచట తప్పక నుడువదగినది. ఆయన ప్రాకృత రూపగుణాదులను ప్రత్యక్షము చేసికొనదలచిన వెంటనే ఆయన కభిముఖముగ పటేలుసోదరుల జనకుడు ప్రత్యక్ష మగునట. వా రిరువురు సుతాభిమాన బద్ధులు తొంబది యేండ్లకు పైబడి యిరువురును జీవించినవారు. తమ పుత్రులను పెంచుపద్ధతిలో నొకే యాదర్శమును గైకొనిరి. అయితే పటేలుసోదరులు పేదకుటుంబమున జన్మించిరి. ఖాను సోదరుల జనకుడు తగినంత ధనసంపత్తి కలవాడు. పటేలు సోదరులు పేదలయ్యు స్వయంకృషివలనను, సంపూర్ణ స్వశక్తివలనను ఔన్నత్యము నందిరి. ఖాన్ సోదరు లారీతిగ నభ్యుదయ మందినవారు కారు. వారితండ్రి జమీందారీ తరహాగా యొక గ్రామమునకు తలమానికముగ నున్నవాడు, అందుచే తనబిడ్డలను పాశ్చాత్యదేశముల కంపి విద్యాబుద్ధులను గరపింప శక్తివంతుడై యుండెను. పటేలుసోదరులు తమంతదామే విద్యాబుద్ధులను నేర్వవలసినవారైరి. అంతే గాక పటేలుసోదరుల జనకుడు సామాన్యసంసారిమాత్రమే యనుటకన్న సన్యాసి యని చెప్పుటకు జంకనవసరములేదు. బెహరాంఖాన్ మహాశయునిప్రకృతి దానికి విరుద్ధమైనది. ఒకప్పుడు ఆయనకు ఎనుబదియేండ్లు దాటిన వయసులో తన

కనిష్ఠపుత్రుని దొరతనము బంధింప తానుకూడ కారాగార ప్రాంగణమున నందులకే సిద్ధపడివచ్చినదిట.

బెహరాంఖాన్ విశేషముగ విద్యాసముపార్జనము చేయలేదుగాని ఆధ్యాత్మిక భౌతికవిజ్ఞాన మార్జించినవారిలో మేటి యనవచ్చును. ఆయన ప్రకృతి యట్టిదయ్యును సాహసమున నందెవేసిన చేయి. ఆ మహనీయుడు తన తొంబది యైదవయేట నసగా 1926 లో పరమపదించెను. ఆయన సునిశితమగు ధైర్యమును, పలుకుబడినిగూర్చి యొకవిషయమును మాత్రము వచించి యీ ప్రకరణమును ముగింతుము.

ఖానుసోదరులతండ్రి సిపాయివిప్లవము జరిగిన కాలమునకు యువకుడుగా నుండెను. ఆ విప్లవవిషయమున పఠానుల సాహసాదికముల నాయన శ్లాఘించినను తద్విప్లవమున వారి ప్రవర్తననుమాత్రము సహింపజాలక పోయెను. అప్పటికి ఖానుసోదరుల పెదతండ్రి చెరసద్దాలో గవర్నమెంటుఖజానాకు రక్షణార్థ మునుపబడిన రక్షకభటుల కధినేతగా నుండెనట. అపుడు సోదరున కెంతయో సాయము జేయ తలపడెనట. అట్టివాడు ఒకప్పుడు తనకనిష్ఠపుత్రుడు రౌలటుచట్టపుటాందోళనలో పాల్గొనగా దొరతనమువా రతనిని బంధించి యెచ్చటికో గొంపోయిరి ఆ సమయమున వారి స్వగ్రామమున నొక మహాసభ సమకూడగా దానికి దాదాపు లక్ష మంది ప్రజలు వచ్చుటయు శతవృద్ధుడైన ఖాన్ సోదరుల

తండ్రియు వచ్చెనట. పదేనుదినములవఱకు పుత్రు నెటకు గొనిపోయినది ప్రభుత్వము తెలియనీయనందున బిడ్డకై ఆయన ఆందోళన చెందుచుండెనట. అప్పుడొక గొప్ప రక్షకభటాధికారి బెహరాంఖానుకడకు వచ్చి, నీపుత్రుని జంపెదమని బెదరించిరట. అప్పుడాయన వెంటనే ఆ యుద్యోగిని కఠినముగ భాషించి వెడలనడపెనట. అందులకై బెహరాం ఖానుగారుకూడ నిర్బంధింపబడిరి. వెంటనే పుత్రుడున్నతావునకే ఆయనను గొంపోవ తండ్రి దుస్థితికి తాను మూలకారణుడనని యాపుత్రుండు వగవగా తండ్రిబిడ్డతో నాయనా! ఇందులకై నీవు వంత నందకుము. నేను మహానందముతోనే నిన్నుగూడగోరి బంధితుడనైతి నని నెనట. పితృపుత్రానురాగ ప్రకాండమగు నాందోళనము సిందులకు సలుపగా నొక బ్రిటిషుద్యోగి పఠానుల నిప్పుడు తృప్తిపఱచి వశపఱచు కొననిచో కొంపమునుగునని భావించి ఆ తండ్రిబిడ్డల నిరువురను కారాగార విముక్తులను గావించి జరిగినదాని కెంతయో పశ్చాత్తాపమును వెలిబుచ్చెనట. ఇందువలన నాఖాన్ మహాశయుని నిఖిలవర్తనము తేటతెల్లమగుట లేదా ?

---

# 3

## బాల్యదశ—విద్యాభ్యాసంగము

"ఆదర్శకప్రాయమై జగన్నుతిగన్న
ప్రాచ్యసామ్రాజ్యవైభవము గలిగి
ఆచార్యకస్థానమై యొప్పు నానాకళా
వృత్తమజ్ఞానసంపత్తి కలిగి
అన్యదేశప్రజాయత్నసాధ్యము కాని
చతురకార్మిక పరిశ్రమలు గలిగి
ప్రబలసత్సప్తద్వీపపర్యంతవిక్రాంత
భూరివాణిజ్యసంభూతిగలిగి
ఏసునకు ముందు నాలువేలేండ్లమును పె
నాగరకతాగ్రగణ్యమైనదిగ దెలుపు
కథలజాడలె నేటికిం గలవుగాని
నాటిభారతభాగ్య మీనాడు గలదె."

భ్రాతృసోదరు లాంగ్లశ్రీమంతులని, ప్రకృతివిలాస లాలసులని చెప్పుకొంటిమిగదా! సరిహద్దురాష్ట్రము కేవలము ఒకమారు మూలనున్న దేశము. అచట విద్యాభిలాష గాని, విద్యాభివృద్ధికి ప్రోత్సాహకరములైన ప్రపత్తులుగాని లేవు. అజ్ఞానాంధకార బంధురమన్నను తప్పులేదు. ఆరీతిగ నా దేశవాసుల నాగరికత బ్రిటిషుపరిపాలకులతాంత్రికమే.

ఆరాష్ట్రములో నచ్చటచ్చట ఆధునికపాఠశాలలు లేక
పోలేదు. అవి మాత్రము కేవల మారాష్ట్రివాసులకన్నిటిని
దుడుచుకొనుట కేర్పడినవే. ఆనాటిమాల్వీలు, ముల్లాలు ఆధు
నికపాఠశాలలకు తమబిడ్డలనుబంపు పెద్దలను తిరస్కార
దృష్టితో జూచువారు. కానిబెహారాంఖాన్ మాత్ర మట్లు
చేయక తనబిడ్డల నెట్లయిన విద్యావేత్తలను చేయనెంచి
ఆయన పెషావరులోని మిషను పాఠశాలలో తనపుత్రులను
చదివింప జేర్చెను.

ఖానుసోదరు లిరువురు నాపాఠశాలయందు నియమ
వర్తనముతో విద్యనభ్యసింప నారంభించిరి. డాక్టర్ ఖానుసా
హేబుఅన్యచింతలులేక కేవలము విద్యాభ్యాసంగతత్పరాను
సంధాయియై యుండువాడు గఫ్ఫార్ ఖాన్. అట్లుగాక లౌకిక
విషయంబు లన్నిటియందు గల్పించికొని చొచ్చుకొనిపోయి
లోకవిజ్ఞానసముపార్జనకిచ్చినంత ప్రాముఖ్యత విద్యాభ్యాసంగ
మున కీయ లేకపోయెను. డాక్టర్ ఖాను అనతికాలములోనే
పంజాబువిశ్వవిద్యాలయమున మెట్రిక్యులేషన్ పరీక్షలో
నుత్తమగుణముల నార్జించి ప్రథమశ్రేణిలోను త్తీర్ణుడయ్యెను.
పిమ్మట అటనుండి బొంబాయిపట్టణమున కేగి యందు వైద్య
కళాశాలలో డాక్టరుపరీక్ష కొకసంవత్సరము మాత్రమే చదివి
తండ్రి ప్రోత్సాహమున నింగ్లాండులో వైద్యవిద్యలో నున్నత
పరీక్షల నొసనసేగెను. ఆయన యింగ్లాండునకుపోవుటకును

గూర్చి బంధులోకమంతయు పరిపరివిధముల నాకుటుంబము కెద్దడి తెచ్చిపెట్టిరి. కొందరు తప్పక ఖాన్ క్రైస్తవమతావలంబి యగు ననియు, మరికొందరు యావజ్జీవమాయన పాశ్చాత్య దేశము లందే యుండిపోవు ననియు వేరు కొందరాయన ఆంగ్లకన్యను బెండ్లాడి కులమువారిలో వెలియగు ననిరి. వారి తండ్రిమాత్ర మెట్టి యాటంకమును జెప్పక సంతోషముతో కుమారు నాశీర్వదించి పంపెను.

గఫూర్ ఖాన్ మాత్రము విధివశంబున మెట్రిక్యులేషన్ పరీక్షలో నుత్తీర్ణుడు కాలేకపోయెను. తనకనిష్ఠ పుత్రునిగూడ నింగ్లాండు పంపి చదివించవలెనని తండ్రి యాసపడెను గఫూర్ ఖానుకూడ అట్లే భావించుచుండెను. ఇంతలో నాకుటుంబమునకు తీరని యాపదలు ఘటిల్లినవి. అట్టి ప్రయత్నము జరుగుచుండగా నా కుటుంబములో మూడు నిండుప్రాణములను మృత్యుదేవత బలిగొన్నది. దాని నశుభసూచకముగా పరిగణించి పరిత్యజించిరి. ఈ తీరున గృహచ్ఛిద్రములచే రెండేండ్లు వ్యర్థముగా పోయినప్పటికి డాక్టర్ ఖాను సాహేబుగారు ఇంగ్లాండులో ఆంగ్లయువతిని వివాహమాడ నిశ్చయించుకున్నట్లు తెలియడం కూడా కొంత అడ్డంకిగా వచ్చి పూర్తిగా నా యింగ్లండుచదువు ప్రయాణం కట్టుబడిపోవడమే గాకుండా చదువునకు స్వస్తికూడా జెప్పడం జరిగింది.

ఖాన్ గఫ్ఫార్ ఖాను మిషనుస్కూలులో విద్యా భ్యాసము చేసినది స్వల్పకాలమే అయినా దానివలన నెంతో ఫలిత మాయన పొందాడు. ఆయన విద్యాభ్యాసకాలంలో నా పాఠశాలకు మేనేజరుగా నున్న రెవరెండ్ విగ్రామ్‌గారు మిగుల నుదారుడు, ఆత్మత్యాగి, పవిత్రజీవనుడు, శిష్యులన్న నాయన కపరితాభిమానము. ఆ గురువువద్దనుండి గఫ్ఫార్ ఖాన్ ఎన్నో సదుద్దేశములను, సదాశయములను గ్రహించెను. గురువు మతదీక్ష యెట్లు పూనెనో తానట్లు జాతీయ సేవాదీక్ష పూనవలెనని గఫ్ఫార్ ఖాను అభినివేశము. ఇంగ్లాండు ప్రయాణము పూర్తిగా నాగిపోవుటవుముం దాయన తనజాతీయసేవాదీక్షకు పునాదిగా సేనలోజేరి సైనికుడుగా పేరొంద దలంచెను.

ఆతలంపుతో గఫ్ఫార్ ఖాను దరఖాస్తు పెట్టుకొనెను. పఠానువంశీయుడును, అభిజాత్యముకల కుటుంబములోనివాడు నైన ఖాను దరఖాస్తు తొందరగానే మంజూరైనది. సేనాని వేశమున వ్యామోహము మెండని ఆయన యెఱుంగును. ఎందరో యున్నతోద్యోగు లా శాఖలోనివా రాయనకు బరిచితులు. అందుచే తానుగూడ జాగరూకతతో వర్తించి పనిచేయగలననే తోచెను. కాని దేవు డన్యథా తలంచినాడు. ఒక దినమున నంతదనుక చాలకాలము నుండి సేనలో బనిచేయు నొక మిత్రుని జూచుటకై గఫ్ఫార్ ఖాన్ సేనాని వేశమునకు బోయెను. ఆ సమయంలో

నొక చిన్న ఆంగ్లేయోద్యోగి వలన తన మిత్రుడుపరాభ
వింపబడుట చూచెను. ఆతఁడాను నుండి సేనలో జేరుటయందు
విముఖుడయ్యెను.

పిమ్మట నొకసంవత్సరము అలీఘరులో తీరికగా కాల
మును వెళ్ళించెను. ఆసమయమును కొంత వ్యర్థము చేయక
ఉర్దూభాషావ్యాసంగము చేయమొదలిడెను. దాని కచట
ప్రచురింపబడు మౌలానా జఫర్ అలీఖాన్ గారిచే బ్రకటింప
బడు జమీందారుపత్రికను, అబ్దుల్ కలాంఅజాద్ గారు వెలువ
రించు 'అల్ హిలాల్' అనుపత్రికను తప్పక చదువుచుండెను.
అదియే ఆయన ఉర్దూపాండిత్యప్రకర్షకు దోహద మిచ్చెను.
కాని ఆపత్రికలలో అల్ హిలాల్ యుద్ధసమయమున నణచి
వేయబడినది. ఆయనరాజనీతిశిక్షకదే శ్రీకారము చుట్టిన
మొదటిరోజులు.

గఫూరుఖానుకు తాను చదువుకు స్వస్తి చెప్పిననాట
నుండి జాతీయవిద్యయం దభిమానము. ఆయన స్వరాష్ట్ర
ములో జాతీయపాఠశాలలు స్థాపించుటయందు ప్రముఖపాత్ర
వహించెను. అప్పటినుండి రాజకీయవాతావరణమున చొఱ
వగా ప్రవేశింప మొదలిడెను. ప్రథమమహాసంగ్రామానంత
రము భారతీయుల త్యాగమునకు ప్రతిఫలముగ రౌలటు
చట్టము ప్రాప్తమయ్యెను. గఫూరుఖాను రౌలటుచట్టము

నివారింప మహాత్ము ననుసరించెను. ఆరోజులలో సరిహద్దు రాష్ట్రమునం దంతటను అద్భుతమైన హార్తాళ్ జరిగినది. అప్పుడే వారిస్వగ్రామములో లక్షమందిజనముగూడిన మహా సభ జరగడం, వృద్ధులైన ఖానుసోదరులతండ్రికూడ నందులో పాల్గొనడం జరిగింది.

బ్రిటిషుప్రభుత్వం గూడా సహనావేశమునకు దద్దరిల్లినది. కండ్లు కుట్టినవి. వెంటనే గఫ్ఫూర్ ఖాను నరెస్టుచేసిరి. కేసును లేదు-విచారణయులేదు అయితే ఆయనను గొన్ని ప్రశ్నలడి గిరి. ఒకరక్షకభటోద్యోగి 'నీవుపఠాన్ చక్రవర్తివా?' అన 'నా కది తెలియదుగాని మాజాతికి తలయొగ్గు సేవకుడను అనగా ప్రభుత్వమునుండి రాయబారిగా వచ్చిన జిర్గా ఖానును సమీపించిఎన్నోవిధముల బోధించెను. మంగళహారతిప్పించెద నని, పలువిధంబులగు కారణములను జెప్పి, యింతవఱకు మీకు విధింపబడినచట్టములకంటె నింకేమి మహిమ గలదు. మీరిందులో చేయిచేసుకొనుటేమియు బాగుగలేదు. పఠా నులను గూర్చి బ్రిటిష్‌యిండియా ఆందోళన జెందనపుడు మీరేల దానికై ఆందోళనపడవలెను? ఎన్ని కారణా లాయన విప్పిచెప్పినా ప్రయోజనం లేకపోయింది. ఇంకాయన్ను జైలులోగూడా సంకెళ్ళతోవుంచి యపాయకరమైన ఖైదీగా చూసేవారు. పైగా యింకా ఎన్నో కేసులు పెట్టడానికి ప్రయత్నించి సఫలీకృతమనోరథులు కాలేకపోయినారు.

అప్పటికి చదువుకై యింగ్లాండు కేగిన డాక్టర్ ఖాన్ సాహేబుగారు లండనులోని సెంట్ థామస్ ఆసుపత్రిలో యమ్. ఆర్. సి. యస్. డిగ్రీని పొంది యుద్ధమునకు వెళ్లెను. యుద్ధానంతర మాయన ఫ్రాంసులో పనిచేయుచుండెను. ఆ సమయమునకే సరిగా యిక్కడ ఆందోళనము బయలుదేరినది. తన సోదరునుండి డాక్టరు ఖాను ఒకజాబునైనను బడయజాలక జన్మభూమికి రావలెనని యత్నింప నారు మాసములకు గూడ ననుమతి లభింపలేదు. డాక్టర్ ఖాను తన ఆంగ్లసతితోను, సంతతితోను, నెట్లో స్వదేశమునకు మరలివచ్చెను. వచ్చినకొలది మాసములకే స్వంత వైద్యాలయము పెట్టుకొని జీవింపదలచి యుద్యోగమునకు రాజీనామా నిచ్చెను. కాని కనుమతి లభించుటయు దుర్లభమాయెను. ఆనాటికి గఫూర్ ఖాన్ చాలవఱకు కాంగ్రెస్ సంస్థయొక్క పవిత్రతను గ్రహించి, కాంగ్రెసు ఆదర్శముల నలవఱచుకొని కాంగ్రెసుసిద్ధాంతములపై నాధారపడి దాని యనుశాసనములలో మెలగి దేశసేవ సేయుట కువ్విళ్లూరుచుండెను. [illegible] లిరువురును ఒకే గర్భమున జన్మించినను [illegible] వారి [illegible] లెట్టి ప్రాతికూల్యవర్తనపథంబున బడినవో చూచితిరా ?

గఫూర్ ఖాను సాహెబ్గారి గుణగణములను గూర్చి విన్నవారి కాయనను ప్రశంసించుటకును, ఆయనతో గలసి దేశ

సేవ సేయుటకును ఉబలాటపడుచుండెను. సరిహద్దు రాష్ట్రము ప్రకృతి వైభవంబుల కాటపట్టని మన మెరింగియున్నాము. అచటికొండలు, ఆ యేఱు, ఆ చిన్న ద్వీపములు, ఆ చెఱకు తోటలు, ఆ కొండచఱియలందలి వివిధఫలజాతుల నిచ్చు వృక్షములు, ఆ కపిలగోవులు—చూపఱ తనివితీరని ప్రకృతి రామణీయకత ఆహ్లాదమొసఁగును. వారచట నొక యాశ్రమమును నిర్మించి యెప్పటికైన మహాత్ముఁ డట కతిథిగా గొంపోవలెనని ఆశించిరి. ఒకప్పుడు గఫ్ఫార్ ఖాను మహాత్మునితో "గాంధీజీ! మీరీ యాశ్రమమునందే యుండవలెను. ఇది మీ యాశ్రమము. ఇటనున్న ప్రశాంతత, రమణీయత్వము గల వాతావరణ మింతకతావుల లభింపదు. ఈ కొండచఱియలందలి ఫలములను భక్షించి ఆవుపాలను త్రావి, మీఁగడ మెసవిన మీ శరీరతూకము హెచ్చగు"నని వచించెను. మఱొకప్పుడు "బాపూజీ! కష్టసహిష్ణుతవలననే వివేకము గలుగును. నాకు లోఁగడ రెండుమూఁడు లనుభవించిన కారాగారవాసము అగ్నిపరీక్షయైనను, నన్ను ఒక దేశసేవకునిగ చేయజాలినది. ఆ భగవానుడు నాకు కల్పించిన క్రమశిక్ష కాయనయెడ కృతజ్ఞుడను" అని పలికెను.

---

౪

## కారాగారవాసము—దేశసేవానిరతి

"పొదుగులనిండ సేపునజేపి మందలన్
గోకదంబము పాలు గురియుచుండె
పైరుచేలెల్ల ముక్కాలు మువ్వీసముగ
పసిడిగారుచుఁబంట పండుచుండె
పరదాస్యమునకు పాల్పడక స్వచ్ఛందతా
నందంబుతో సౌఖ్యమందె జనము
పూరిపుల్లకు వేఱువారిపై నాధార
పడక దేశము భాగ్యవంతమయ్యె
గ్రామములయందు స్వీయసంఘములదీర్పు
పద్ధతికి బద్ధమై ప్రజ పరులచేత
వేలు వంపించుకొనక జీవించుకతన
జాతియందెంతయో వికాసంబు హెచ్చె."

ఖానుగఫ్ఫార్ ఖాను మొట్టమొదట 1920 లో నాగపూరులో జరిగిన కాంగ్రెసు మహాసభకు విచ్చేసెను. ఆ సమయమందే బయలుదేరిన ఖిలాఫత్ ఆందోళనలో ప్రముఖపాత్ర వహించి రాష్ట్రీయశాఖలో దన యధ్యక్ష పదవికి తిలోదకంబు లొసగి ఖిలాఫత్ ఉద్యమమునం దస్వతంత్రదేశమున నివసింప కూడదని యితరదేశమునకు తరలి

పోవ నుద్యోగించిన మహాజరీను సంఘమునకు నాయకు డయ్యెను. అపుడు ఆఫ్గనిస్థానమునకు రాకపోకలలో నాయనపడిన పాట్లు, పొందిన యిక్కట్లు చుట్టుకొన్న చిక్కులు యిట్టివని వంచింపరానివి. అన్నిటికంటె గొప్పచిక్కు ఆయన వృద్ధజనకుడు తోంబదియేండ్లవయసువాడయ్యు మహాజరీనుల యాందోళనలో ప్రవేశించి యెంత చెప్పినను వినక తనను వెన్నంటివచ్చు జనకుని మరలించుటకు పడిన శ్రమ.

పిదప కొన్నిమాసములకే అనగా 1921 సంవత్సరములో ఫ్రాంటియర్ రెగ్యులేషన్ ఆక్టుప్రకారము గఫూర్ ఖాను మరల కారాగారమున నుండవలసినవా డయ్యెను. ఈ నిర్బంధమునకు నిర్దిష్టమైన కారణము లేదు. గఫూర్ ఖాన్ నాగపూరు కాంగ్రెసునుండి స్వస్థానము చేరిన వెంటనే నిర్మాణకార్యక్రమమునందు చురుకుగా పనిచేయ జొచ్చెను. అందుల కాదిలో నాయన స్వగ్రామములో నొక జాతీయపాఠశాలను నెలకొల్పెను. పిదప దానికి శాఖలుగ చాల పాఠశాలలను రాష్ట్రమందు స్థాపింప జూచుటకు యత్నించెను. అందులో సత్యాగ్రహ చిహ్నలు కించిత్తయి నను లేవు. అయితే ఆయన హృదయసీమలో నీ జాతీయ విద్యాభివృద్ధి కొక మహాదాశయము స్ఫురించుటచే తన శక్తినంతను జూపి యత్నము చేసెను. ఈ మాత్రమునకే దొరతనమునకు కన్నుగుట్టి ముందుగా నాయనను

రాష్ట్రములో నేమండలమునందుగాని తిరుగరాదని యడ్డు తగిలి సెక్యూరిటీ కోరెను. ఆతని కది అసహ్యాకరముగ దోచెను. అప్పటికి సరిహద్దు రాష్ట్రమునకు పోలీసుఛీఫ్ కమీషనరుగానున్న సర్ జాన్ మాఫే యేవిధముగానైన నతడు స్థాపించిన జాతీయసంస్థను మాయింప నిశ్చయించుకొనెను.

అందులకుగాను గఫ్ఫార్ ఖాను తండ్రివద్దకు పదేపదే వచ్చి నీకొడుకు ఆంగ్లేయులకు వ్యతిరేకముగా పని చేయుచున్నాడని-రాష్ట్రములో నేయొక్కరికిగాని పట్టని యీపాఠశాలానిర్వహణదీక్ష నీకొడుకున కేల కావలసివచ్చినదని-ఆ సంస్థను మూయింపుమని-లేనిచో పలుచిక్కులు తటస్థించునని చెప్పుచు వచ్చెను. అందుపై తండ్రి గఫ్ఫార్ ఖానుకడ నీ ప్రసక్తి యొకసారి తేగా 'నాయనా! నేడీసంస్థను మూయుమనిరి, రేపు నమాజునే నిషేధింతురు. మానివేయవలసిన దేనా' యనెను. అంతతో తండ్రికూడ ఆవిషయము పట్టుదల వహించి కొడుకును జాతీయసంస్థలనిర్మాణమునకు మరింత ప్రోత్సహించెను. ఆకమీషనరుయత్నమంతయు బూడిదలో బోసిన పన్నీరయ్యెను. తన్మూలమున నిక లాభము లేదని ఆపోలీసుద్యోగి మూడేండ్లు కఠినశిక్ష విధింప జేసెను.

అంతకుమునుపే గఫ్ఫార్ ఖాను కొంత కారాగారపు టిక్కట్లు చవిచూచి యుండెను. ఈమారాయనను పెట్టిన బాధలకు పరిమితియే లేదు. ఊపిరి త్రిప్పుకొనుటకైన వీలు

లేని యిరుకుగదిలో నుంచుట, నెలలతరబడి కాళ్ళేతులకు శృంఖలములుంచుట, మిగుల కఠినములైన పనులు చేయించుట మొదలిరి ఈబాధలతో నాతనిశరీరము గుల్లబారి చిక్కిశల్యమయ్యెను. రక్తపిత్తవ్యాధి పొడసూపెను. నడుమునొప్పి విపరీతమయ్యెను. ఈబాధలు హెచ్చినకొలది అంతకంటెమిన్నగా నతనియుత్సాహాగ్ని ప్రజ్వలితము కాజొచ్చెను. ఆకమీషనరు పదేపదే తనకోరిక నీడేర్చుకొన యత్నించుచునే యుండెను ఒకప్పుడు గఫూర్ ఖానుమిత్రుడైన ఖాను బహాదూర్ అబ్దుల్ రహీంఖానుచే నిట్లు వర్తమానమంపెను. స్వగ్రామమునందలి జాతీయసంస్థను మూయనక్కరలేదుగాని రాష్ట్రసంచారమును మానుదునని మాటయిచ్చిన వెంటనే విడుదల చేయింతును' అనిన గఫూర్ ఖాను అందులకు సనేమిరా యన్నాడని వేఱచెప్పవలయునా ?

అయితే ఆకారాగారమున ఖానుచూపిన ధైర్యము, గడపినమనుగడ మిగుల నాశ్చర్యజనకములు. జైలుసూత్రములను సూదిమొనయంతగూడ దాట తలంపలేదు. ఇచ్చకములకు తలయొగ్గి తనసిద్ధాంతాలను త్యజింపలేదు. ఒకఆదర్శకప్రవాసి యనిపించుకొనెను. అధికారులలో చాలమంది యితని యెడ తమవిధ్యుక్తధర్మములకు ప్రతికూలముగ నడచి యితని పట్ల సౌజన్యము చూపనెంచగా నతఁడంగీకరింపలేదు. ఆయుద్యోగులు ఖానుచేయవలసిన పనులను తామే మనస్ఫూర్తిగ

చేయనుంకించుటకు బూనుకొనిరి. చిరకాలమునుండి కారా
గారమున మ్రగ్గియున్న కొంద రాయన వెట్టిపనులు చేయ
నక్కరలేకుండ తామందరును గలిసి యనుమతిని దెప్పింతు
మనిరి. కాని యతడ గీకారమును జూపలేదు సరిగదా మీదు
మిక్కిలి వారి నిట్లు చేయుట తప్పని మందలించువాడు.

నేడువలెనే అప్పుడును జైళ్ళయందు నీచాతినీచము
లగు లంచగొండితనము లధికముగ నుండెడివి. కొందరు
శిక్షితులు లంచమునిచ్చి పనిచేయ నవసరములేకుండ నను
మతులును. శిక్షలతగ్గింపులకు యత్నించి చరితార్థులగుచుండ
లంచము లిచ్చినవారిని పుచ్చుకొన్నవారినిగూడ చీవాట్లు
పెట్టువాడు. ఒకప్పు డొకసిపాయి "ఈ విధముగా గానిచో
మాకు సుఖముగ జీవనము జరుగ"దని దీనముగా నాయనతో
బలికెను. అపుడు ఖాను నిన్నిట్లు నడచుకొనుమని నేచెప్పను
గాని నీవు చేయునది యపరాధము అని చెప్పెద ననెను. ఈ
ప్రబోధమువలన నా సిపాయి వెంటనే తనపనికి రాజీనామా
యిచ్చెను. ఈ సంఘటన మధికారు లెరింగి గఫూర్ ఖానును
మరింత బాధించుటేగాక యటనుండి పంజాబుజైలునకు
మార్చిరి. అచట నతని కితర ఖైదీలతో గలిసియుండు నదృ
ష్టము కలిగెను. అంతేగాక ఆధ్యాత్మికానుభవమునకు గూడ
దోహదము చేసినది. అతడా కారాగారమందు తనకు
స్నేహితులైన హిందూ సిక్కు ఖైదీలతో పరిచయము

గల్పించుకొని భగవద్గీతను, సిక్కుల యుద్ధగ్రంథమగు గ్రంథ సాహేబును, బైబిలును నేర్చుకొన మొదలిడి, యందు పట్టు దలతో కృషిసల్పెను. ఆ జైలునకు ఆ సమయములోనే అండమాను దీవులనుండి వచ్చిన విప్లవకారుడు పండిత భగత్ రాముతో పరిచయ మేర్పడి తన్మూలమున నాధ్యాత్మిక విజ్ఞానము మరింత హెచ్చయ్యెను. ఖాను సర్వదా మహాత్ముని జీవితమును సవిమర్శముగ బరింపుచు నందలి నియమముల నెక్కువుగ పాటించువాడు. వారమున కొకదినమున ఉపవసించుట—ఒకదినము మౌనమువహించుట అవలంబించుచు వచ్చెను. అందుచేతనే అతనికి "సరిహద్దుగాంధి" అని బిరుదు వచ్చినది.

అప్పటికి దొరతనమువారి దయవలన దేశములో హిందూమహమ్మదీయ కలహములు పుట్టి కల్లోల మారంభమైనది. ఆ సమయమున నతడు సంకుచితమతచర్యలకు కడు దూరముగ నుండెననుట కాయన వచించిన మాటలను తిలకింపుడు. "మతప్రాశస్త్యమును మానవకోటినిగురించి నేను పరిగణింపను. ఆచరణలోలేని మత విశ్వాసము గణింపరానిది. ఇస్లాం మతమనగా సదాచారము, శ్రద్ధ ప్రేమముల కలయిక యొక్క ఆరాధన. మానవుడు ముముక్షువు కావలెనన్న "ఏకేశ్వరోపాసన–సదాచారసంపత్తి, సత్క్రియాచరణ, లలవడిన చాలును" అని వచించెను.

అంతేగాక అతడెట్టి ఆనంద విషాదపరిస్థితులలోనున్నను వేళ తప్పక నమాజుచేయని దినమొక్కటియు నుండదు. ఈ సోదరు లిరువురిలో నన్ని విధముల గఫూరే నైష్ఠికాభాసు డనవచ్చునుగాని విదేశములం దెంతో కాలమున్నను డాక్టర్ ఖానుసాహేబుకూడ నన్ని మతముల వారితో నాయాదేశము లందు మైత్రి నెఱపియుండుటచే నతనికి మతవిషయమున విశాలదృష్టి యబ్బినది. అయితే నేటి మహమ్మదీయులందరి లోకంటె గఫూర్ ఖానునందు భ్రాతృతాగుణ మధికముగను స్వభావసిద్ధముగను పుంజీభూతమై యున్నది. ఒకసోదరుడు వృత్తిజీవనుడైతే, అతనితమ్ముడు స్వచ్ఛందదేశసేవకుడైనాడు.



౨౮

## మితభాష—నిర్దుష్టభావములు

"తమవారితోడ హైందవులకును రాజకీ
యోన్నతోద్యోగంబు లొసగినాడు
తమవారితోడ హైందవకవీంద్రులగూడ
ఘనుల నాస్థానమునందుంచినాడు

తనమతంబునకు హైందవమతంబున కొక్క-
విధగౌరవంబె కల్పించినాడు
తమకు హైందవుల నెయ్యముతోడ వియ్యముల్
నిలువ నెంతయొ ప్రయత్నించినాడు
సమతతో రాజ్య మొకకుటుంబముగ ప్రజలె
బిడ్డలుగ దాను దండ్రిగా బ్రియము నెఱపి
యుర్వి నేలిన యక్బరు సార్వభౌము
దలచికొన నేటిమన పాపములు దొలగు."

భారత దేశమున హిందూరాజులపరస్పరకలహకారణముగా విశాలహైందవరాజ్యసీమ మహమ్మదీయుల చేజిక్కినది. వారు సమైక్యత లేకపోయినను నించుమించుగ యేడు వందలసంవత్సరము లీభారతసామ్రాజ్యము నేలిరి. వారికాలమున భారతభూమియందలి ప్రాచీనవైభవస్ఫురణ, ఆ ప్రభువులు తమ కిదే జన్మభూమిగా తరతరములు వసించిన కారణమున నించుకంతయు బీఱుపోలేదు. మతవిషయమునం దేయొకరో యిద్దరో కొఱమాలిన పట్టుదల యుద్ధతులుండినను భారతీయసంతతికిని, తమవారికి మైత్రిగూర్చుచునే పాలించిరి. అందు షర్షాచక్రవర్తి పాలనము రామరాజ్య మనిపించుకొనెను. అక్బర్షాచక్రవర్తిపాలనము దేవరాజ్యమని యెందరో హైందవకవులు తమ కావ్యశ్రేణిపై వాక్సుధావర్షంబుల గురియించి వెలయించిరి.

అయితే ముసల్మానుల కాలమున షాజహానుచక్రవర్తి అమరేంద్రధనువు నవహసించు నైజకాంతితో నవరత్నమయమగు మయూరాసనమును నిర్మింపజేసియు, తాజిమ్‌మహాల్, ముంతాజ్ మహాల్ నిర్మాణింపజేసియు, నింక నెన్నెన్నో మహా సౌధంబుల గట్టించియు జనహితములైన కార్యములకు డబ్బు కోట్లకొలదిగ విచ్చలవిడిగా వ్యయమొనరించినను నక్కాలమున నేటి ఋణపాతకంబు పొడసూపలేదు. ఆ ముసల్మాను చక్రవర్తులు హిందూమహమ్మదీయ సఖ్యతనే పాటించి పాలించిరి. కాని బ్రిటిషుప్రభువులు తురకలపాలన మతిదోషయుతంబని మోసముగ నిరసించి తాముప్రాసి వ్రాయించిన దేశచరిత్రలనే పాఠశాలలందుకూడా హిందూబాలుర కగ్గువాలతో బెట్టించి తమ విభజించి పాలించు రాజనీతికి పునాదులుగ గట్టుకొని హిందూమహమ్మదీయ సఖ్యతను నాశనమొనర్చినకతముననే యిప్పటికి తద్బీజములు భారతదేశమంతయు వ్యాప్తములై యీరెండు తెగలవారల కల్లోలసముద్రమున నీదులాడుటకు హేతుభూతములగుచున్నవి.

అట్టి దుస్థితులలోకూడ మహమ్మదీయులలో నంతంచు హిందూమతాశక్తిని జూపుచు హిందూ మహమ్మదీయ మైత్రికి నానందసాగరమున నీదులాడువా రున్నారని మన మెఱుంగ నువ్విళ్లూరుట సమంజసమే. ఖానుసోదరుల మత విశ్వాసమును విశాలదృష్టితో పరిశోధించితిమా వారి మత

భాస యెట్టిదో తెలియగలదు. ఒకప్పుడు గాంధీజీ గఫ్ఫార్ ఖానులు కలిసియుండగా మీయన్న ఆంగ్లవనితను పెండ్లాడి నాడుగదా? ఆమె ఇస్లాం మతమును స్వీకరించినదా యని గాంధీజి యడిగిన ప్రశ్నకు గఫ్ఫార్ ఖాను ఆమె యేమతాభిమానినియో నేను చెప్పజాలనన్న మీ రాశ్చర్యపడుదురు. ఆమె మతమును మార్చుకొనలేదని నా కెఱుకయే. ఆమె మతవిషయమున స్వతంత్ర. నే నెప్పుడు ఈవిషయము నామె నడుగలేదు. అడుగనవసరమేమి? భార్యాభర్త లయినంత మాత్రాన మతైక్యత యావశ్యకమా? నే నంగీకరింపను. అని చెప్పెను.

అసలు గఫ్ఫార్ ఖాన్ ఆశయము మహమ్మదీయులలో చాలమందికి ఇస్లాం మతతత్వమే తెలియదు. అదియే మత కలహాలకు బీజముగా పరిణమించుచున్నది. ఇరుపక్షముల లోను స్వార్థపరులు కొందఱు విభిన్నత్వమును, దానికి విశేషావేశమును వింతవింతలుగ రగుల్కొల్పి ఉద్రేకింప జేయుచున్నారు. మతావేశ పరత్వమున గఫ్ఫార్ ఖాను ప్రశాంతాదిగుణము లెఱుంగుటకు వందలాదిగ ఉదాహరణ లను జూపవచ్చును. 1930 లో ఆతడు గుజరాతుజైలులో నున్నప్పుడు హిందువులయెడ సోదరభావమును నెఱపుచు వారితో విశేషపరిచయమును గలిగించుకొని తాను వారి కడ గీత నభ్యసింపుచు వారికి తాను కురాన్ ధర్మము లను బోధింపుచుండువాడు. కొందరు అవివేకులు వారిని

హిందువు లని, మహమ్మదీయు లని వేఱుపఱచి అపనిం
దల పాలుగావించువారు అట్లు చేసినను తాను గీతను పఠిం
చుట, ఖురానుధర్మములను బోధించుట మానలేదు.

మతాధికృత, మతతత్వమును గుర్తెరింగినవానికిఆరెండు
మతములపట్ల భేదభావము లేదని గఫ్ఫూర్ ఖాను ఋజువు
చేయువాడు. కాని ఆచరణలో కొంద ఱవివేకత్వమును ప్రక
టించుట కేవేవో కల్పనలు చూపువారు. ఇస్లాంమతము
దంతధావన కెండినపుల్లలే వాడనుని చెప్పుచున్నదని, పచ్చి
పుల్లలను హిందూమతము చెప్పుచున్నదని, వారమున కొక
సారి స్నానము చేయుమని ఇస్లాంమతము, ప్రతిదినమునకు
ఒకటి లేక రెండుపర్యాయములు స్నానాద్యనుష్ఠానములను
హిందూమతము విధించుచున్నదని, పలుకు మాటల నాయన
ఖండించువాడు. రోజునకు రెండుపర్యాయములు స్నానము
చేయుచు దంతధావనకు పచ్చిపుల్లలను వాడు మహమ్మ
దీయుని ఇస్లాంమతము దండింపదు. హిందూమతముకూడ
నట్లే. ప్రతికూలవిధుల నాచరించినవారిని దండింపదు. మత
ప్రకృతియే తెలియనివారు మతతత్వవిచారణకు పూని మత
ధర్మములను మలినపఱచరాదు. అంతేగాక ప్రపంచమం
తయు ఏకమతమైన జనులు నిఖిలసుఖముల ననుభవించుచు
సంతోషమందుదురు.

మఱియు గఫూర్ ఖాను మతైక్యతకు పరిశోధన పరి
భాష నిట్లు విప్పిచెప్పువాడు. ప్రతిరైల్వేస్టేషనునందు, పట్టణ

ముల మధ్యభాగములందు హిందువులటీ—మహమ్మదీయుల టీ యని, హిందువుల నీరు—మహమ్మదీయుల నీరు అని యెందుకు భేదమును ప్రతిపాదింపవలెను. ఈ యిరు మతముల వారు పరస్పరము ఒకరిపాత్రనుండి మరొకరు నిర్మలజలమును గ్రహించుట దోషమని యెందుకనవలెను అని చెప్పువాడు. ఒకప్పు డాతడు హిందువుల మనస్సునకు నొప్పికలుగజేయ కూడ దను నుద్దేశముతోను, మతైక్యత ప్రబోధింపుచు పాటించు దలంపుతోను శాకాహారులగు తోడిఖైదీలు హిందువులతోపాటు మాంసమును వర్జించి శాకాహారముగనే ఉండెను. మరొకమారు దేవదాసుగాంధి వీరింటి కతిథిగా బోయి నాలుగు దినము లుండెను. ఆ నాలుగు దినము లాకుటుంబములోనివా రందఱును మాంసమును వర్జించి శాకాహారులుగ నుండిపోయిరి. గఫ్ఫార్ ఖాను ఆశయము హిందువులుకూడ యిట్లే ముసల్మానుల ఆచారములయెడ నాదరము చూపవలెనని, దానివలన మతసఖ్యత యేర్పడు నని యుద్దేశించువాడు.

అంతేగాక గఫ్ఫారుఖాను పదేపదే హిందూ మహమ్మదీయుల యైక్యత యెన్నటికైన సుస్థిరత నందితీరు నని విశ్వసించును. ఒకప్పు డాయన గొప్పమసీదున కధికారి యైన మౌల్వీకడ హిందూముస్లిముల పొందుగూర్చి ప్రసక్తి చేయ, ఆ మౌల్వీఖానును "అబ్బాయీ! ఇది అర్థము లేని పని. ఎప్పటికిని జరుగకూడని యసాధ్య కార్యము.

నీవ్రుస్వీయమతమునకు చుక్కెదురుగ నడచుట తప్పునుమా! విగ్రహారాధకులతో మనకు మైత్రియా' అని మందలించెను. అంత గఫూర్ ఖాన్ కొలదియాగ్రహము దెచ్చుకొని వారు విగ్రహారాధకులు. మనమో, గోరీలపూజచేయమా? ఈశ్వరు డొక్కడేయని హిందువులు కూడ నమ్మినపుడు దైవభక్తిలో మనకు వారు తీసిపోదురని మీరనగలరా? హిందూముస్లి ములసఖ్యత అయితీరునని మీరేల విశ్వసించరు? సత్ప్ర యత్న మెప్పుడును వ్యర్థము కాదు. పొలములో చల్లిన విత్తనములు కొలదిదినములు భూగర్భితములై యుండికదా మొలకలెత్తును. మరికొంత కాలమునకు పెరిగి పెద్దవై హెచ్చుగ సస్యాదికము నిచ్చును. మంచివిషయమున జేయు ప్రయత్నమేదియైన తుట్టతుదకు కొనసాగితీరుననుట యథార్థ మని హుంకరించెను. ఆయన తలపంకించి చప్పరించె.

మరొకప్పుడు ఖానుసోదరుల నొకానొక మునల్మాను పత్రికాసంపాదకుడు కలిసి, మాల్వీవలెనే ప్రశ్నించి, యూరకొనక, ఇసుక నేల దున్నవలయును? హిందువులను విశ్వసింపు మని లేదు. శివాజీసంగతి మీరెఱుగనిదా యని పలుకగానే డాక్టర్ ఖానుసాహేబు, అయ్యా! శివాజీనిగూర్చి మీకేమో తెలియునని మీరనుకొనుచున్నారు. ఒక హిందువు మీ యెదుటకు వచ్చి ఔరంగజేబును తిట్టుచు ముస్లిములను నమ్మకూడదని పలికిన, నీ వేమందువు? అదియటుండనిండు,

శివాజీ ఔరంగజేబు ఎన్నఁటో కాలధర్మమందిరి. వారినూ
టెందులకుగాని మహాత్మునిగురించి తామేమి సెలవిస్తారు ?
ఆయనను మనము విశ్వసించినప్పుడు మమ్ము విశ్వసింపుడని
అడుగనక్కఱలేదుగదా? ఒకవేళ అడిగినను తప్పా? ఒకజాతి
మెఱుగువిగ్గులను ప్రదర్శింపవలెనన్న ఆజాతిలోని మేలుజాతి
రత్నముల నేరుకొనవలెనుగాని గులకరాలు నేరుకొని యెత్తి
చూపనేల ? అని ఖండితముగా చెప్పెను.

ఇంకను ఖానుసోదరులు మతవిషయమునని ట్లు తాము
విశ్వసించిన తీరును ప్రబోధింతురు. ఏముస్లింగాని నిజమైన
ముస్లిమే అయిననా డతడు హిందూముస్లిమ్‌సఖ్యతకు,జాతీయ
మహాసభతంత్రమున పాటుపడువాడే అవుతాడు. ఒకందులకు
మేము విచారిస్తున్నాం. మా సల్మాను సోదరులలో కొందఱు
కాంగ్రెస్ పేరు చెపితే నే వణుకుతారు. కాంగ్రెస్ కేవలము
హిందూసంస్థయని, మనకు దానితో సంబంధ మక్కఱలేదని
వారియూహా. ఈ విధముగా పవిత్రవంతమగు కాంగ్రెస్‌సంస్థను
చిత్రించుటకంటె అపచార మింకొకటిలేదు. కాంగ్రెస్‌విధా
నము, ఆదర్శములు, నిబంధనలు,ఉద్దేశములు చక్కగానెఱిం
గిన నిట్లనలేరు. ప్రజలను పరదాస్యమునుండి పరపీడనము
నుండి విముక్తి నందించునది ఆజాతీయసంస్థకంటె వేరేదియు
లేదు. కాంగ్రెస్‌సంస్థయొక్క ప్రధానలక్ష్యముఅన్నాతురులకు,
పేదసాదలకు కూడుగుడ్డ ఒసంగజూచుటయే. కాంగ్రెసుయొక్క

మతప్రవక్తలయొక్క లక్ష్య మొక్కటియేగాని అన్యథా కాదు. ఇస్లాముకు విరుద్ధమును గాదు.

మఱియు నా సోదరులు అహింసాసిద్ధాంతమునుగూర్చి వచించెడి వాగమృతము మధురధార లొలుకుచుండును. అహింసాసిద్ధాంతము పరమోత్కృష్టమైనది, సనాతనమైనదీ, యని, మతవివేక మెంత స్వల్పముగా కల్గినను నేకీభవించి తీరును. దానికి హిందువని, ముసల్మానని, పఠానని భేదమే లేదు ఉండకూడదు. కొంచె మిస్లాం మతమును సింహావలోకనము చేసితిమేని పదునాలుగువందలయేండ్ల క్రిందటనే యీ సిద్ధాంతము మహాప్రవక్తయగు పైగంబర్ సాహేబుల వారిచే మక్కాలో నున్నకాలమున నాచరణలో బెట్టినదే యని తెలియగలదు. ఆ నాటినుండియు ఆర్తరక్షణ మొనరింపబూనినవా రాచరణలో నుందుచునే యుండిరి. మన మవివేకులమై గాంధీజీ దీనిని మనముందు చెప్పినప్పుడు, ఆయన యేదో నూతనాయుధమునో, నవీనశక్తినో, క్రొత్త సిద్ధాంతమునో ప్రయోగించెనని గ్రహింపలేకపోతిమి. విస్మృత మతోద్ధరణమునకును, పతితజాతి నుద్ధరించుటకును, వారి యాపదల బాపుటకును, తుప్పుపట్టిన యీ సిద్ధాంతమును ప్రకటించి పునః మనయెదుట బెట్టగల గౌరవ మా మహాత్మునకు దక్కినది. ఆయన యిందు కృతార్థుడై విజయ మంద గలడనుట నిస్సంశయము.

పలుమాటలేల? గఫ్ఫూర్ ఖానుసోదరుల మతతత్వా భాసను గూర్చి యెంత చెప్పినను తనివితీరదు. వారట్టి వారలు. వారే పదిమంది యెదుట మాటలాడినను నేటి యీ స్వాతంత్ర్య సమరము హిందూముస్లిమ్ జాతుల రెండింటిని పరదాస్యమునుండి పరపీడనమునుండి తప్పించుట కొరకేయని, ఇందు హిందువు లంతగా పాల్గొనుట, ముస్లిములు వీరితో సఖ్యత నెఱపి పనిచేయుట యితరుల నుద్ధరించుటకు గాదని వచించుచుందురు. అంతేగాక పూర్తిగా పరాయివానిక్రింద బానిసలుగా నుండి జీవించుటకంటె యిరుగుపొరుగువారి కణగి మణగి యుండుటయే శ్రేయోదాయకమని వక్కాణింతురు.

ఇట్టి ప్రబోధకులు అల్పసంఖ్యాకులున్న మతసఖ్యత సామరస్యము గాకుండుట సాధ్యమగునా? హిందూముసల్మానుసోదరులు క్షీరనీరన్యాయముగ మెలంగి ఏకకుటుంబమై పోయిన పరదాస్యము పరుగులెత్తదా? పరబాధ లంతమొందవా? అట్టి సుదినము నేనాటికి చూతుమోగదా !!

౬

## ఈ శ్వ ర సే వ కు లు

"దివిషద్వాహిని మాకు వాహిని మహాదేవుండె దేవుండు
బల్లవియే మాకు గృహంబు నీదశదిశల్బాగైన పుట్టంబు మృ
త్యువ చూడంజెలికాడుసువ్రతము నెంతో యీయుద్దైన్యవ్రాతం
బువిచారింపగ వేయునేల నటన ద్వ్యాజంబె కంజాక్షియున్."

ఒక మహాపురుషుడు మానవసేవయే ఈశ్వరసేవ యని వచించినదానిలో నెంత నిబిడీకృతము క్షపదసంచయము గలదో జగంబునందలి ప్రతివ్యక్తికిని అవసరా నవసరములతో నిమిత్తము లేకుండ కావలసినదే. అయిన నలుబదికోట్ల మంది భారతీయులలో నట్టివా రెందరున్నారని గణించితిమేని వ్రేళ్ళమీద మాత్రమే లెక్కపెట్టుటకు సరిపోవుదురేమో! అట్లయిన భారత భవిష్యత్తు ఏమి కావలసినదని పరితపింప వలెనా? ఎందులకు పరితపింపవలెను. ఏకాలమున కాకాలమున మహాపురుషులు ఉద్భవించి, ఈశ్వర సేవకులను సృష్టించి రక్షించుట లేదా? ఇంకను నత్యావసరమైన గీతలలో భగవానుడు స్వయముగా తాను పార్థున కుపదేశించినతీరున నెప్పు డెప్పుడు ధర్మహాని సంభవించిన నాయాసమయములందు దుష్టులను రూపుమాపి సాధువులను రక్షించుట కా భగవానుడు అవతరించుచుండెను గదా? అట్లని మానవులు

తోడి మానవుల సేవ నుపేక్షింప వచ్చునా? ఈ యథార్థ మెఱింగినవా రాకో అతను దీర్ఘ బద్ధకంకణులై మానవ సేవాదీక్ష నవలంబించుట మానలేరుకదా!

అట్టి పరమరహస్య మెఱిగిన ఖానుసోదరులు ఈశ్వర సేవ నేతీరుగా చేసిరో పరికింతము. ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ 1924 లో కారాగారమును వెలువడి వచ్చినతర్వాత కేవలము సంఘసంస్కరణ కత్యావశ్యకములైన కార్యముల తీర్చిదిద్దుటలో నిమగ్నుడయ్యెను. అట్లని కాంగ్రెసుద్యమము నుపేక్షించినారని భావింపకుందురుగాక. ఆ జాతీయోద్యమములో నొక శాఖగా నెంచి యీశ్వరసేవకు గడంగినాడని గ్రహింపుడు. ఆయన కాంగ్రెసుకు సంబంధించిన సమావేశము లన్నింటికిని చిన్న పెద్ద తారతమ్య మెంచక హాజరగుచుండెడివాడు. ఆ సమావేశ విశేషములను పూర్తిగా గ్రహించి తదనుగుణముగనే తన కార్యక్రమమును నెఱపువాడు. అయితే బంగారమునకైనను గోడచేరువుండవలెను గదా? అట్లే ఆయన త్వరితముగా నున్నతదశకు రాలేక పోవుటకు కొన్ని హేతువులున్నవి. అందు ముఖ్యముగా నతడు నిరాడంబరుడగుట, నిగర్వచూడామణియు నగుటయే. ఆయన వేషభాషలుకూడ దానికి దోహద మొనర్చినవి.

అయితే గఫూర్ ఖాన్ సరిహద్దురాష్ట్రములోమాత్రం ప్రజల బంగరుహాటతు లందుకొనుచునే యున్నాడు. ఏనాడు

స్వగ్రామమను ఉత్ మంజాయిాలో జాతీయసేవకు పునాది రాయియనదగు జాతీయపాఠశాలనుస్థాపించి నడుపుటయేగాక రాష్ట్రిమంతట నట్టిపాఠశాలలను నడపుట కుద్యమించెనో, ఆపాఠశాల లెక్కలేనంతమంది సేవకులను సిద్ధపఱచిన అహమ్మదాబాదులోని గుజరాతీవిద్యాపీఠమునకు 1932 లో ఎట్టి యవస్థ పట్టెనో ఎట్టియవస్థనే పొందెనో నాటినుండియే గఫ్ఫార్ ఖాను సరిహద్దురాష్ట్రమున కుజ్జీవకుడై ఆరాష్ట్రప్రజలకు నాయకు డయ్యెను. ఆపాఠశాలయందు తయారైన సేవకులే ఈశ్వరసేవకు లనిపించుకొన్నారు. గఫ్ఫార్ ఖాను ఈశ్వరోపాసకు డగుట తాను సిద్ధపఱచిన స్వయంసేవకాదళమున కానామమునే వెలయించినాడు.

ఆ స్వచ్ఛందసేవకులు పఠానులను స్వైరవిహారముల నుండి, లూటీలనుండి మఱలించి, వారికి విద్యాప్రదానశిక్షణ నొసంగుటకును, వివాహాదిసకలకార్యకలాపంబులందు మిత వ్యయ మొనర్చునటుల జేయుటకును, ఖాన్ సాహేబు చేనియమితులై కార్యక్రమమును నియమబద్ధముగా గావించు చుండిరి. మొట్టమొదట కేవలము సంఘసంస్కరణ కనువగు కార్యకలాపముననే యీదళమును సిద్ధపఱచియుండెను. గాని క్రమముగా దానిని కాంగ్రెసు సంస్థయందలి సమగ్ర కార్యక్రమమును కొనసాగించు సంపూర్ణరాజకీయసంస్థగా 1929 లో పరివర్తిత మొనరించెను. అప్పటినుండి యీ దళ

మునకు "ఎఱ్ఱచొక్కాల దళము" అని పేరిడెను. అయితే మంచితనమన్న నేమో యెఱుంగని కొందఱధికారుల కా నామము జాతీయరామణీయకములతో వెలుంగుచున్నను కర్ణకఠోరమైనది.

ఏగూటిచిలుక ఆ పలుకే పలుకునన్న సామెతగా సంఘ సంస్కారణోన్ముఖమగు నైయుక్త్యమమందైనను విప్లవమునే చూచుటకు తయారగు నధికారు లీయెఱ్ఱచొక్కాల దళమందుగూడ విప్లవరేఖలనే పొడకాంచగల్గిరి. మొదట తెల్లనిఖాదీ దుస్తులతోనే నిర్మాణింపబడిన యీదళముయొక్క యూనిఫారము త్వరలో మలినములు కాకుండుట కెఱ్ఱరంగు దుస్తులుగ మార్చబడినది. ఈ సేవకదళము ముఖ్యముగా సాగించెడి కాంగ్రెసుసంస్థకు సంబంధించిన కార్యక్రమము విదేశవస్త్రశాలలు కల్లుదుకాణములు మొదలగువానివద్ద పికెటింగు చేయుట. వారనుదినము దేశీయవ్యాయామమును మిల్టరీపద్ధతిలో క్రమశిక్షతో నెఱపువారు, పాదచారులై చాలదూరము నడచివచ్చుట, హస్తములందు లాటీలు, ఆయుధములు లేకుండగ తిరుగుట, ఎట్టికఠినశిక్షనైన ననుభవింపశక్తితయారుగా నుండుట వారి యుపకృత్యములు. కాని నాయకునియందుగాని, నిర్ణీత కార్యక్రమ మందుగాని యెంత స్వల్పమైన యవిధేయత గనుపఱచినను, ఆశాభంగ మొనర్చినను ఆ క్షణమునుండియే ఆదళమునకును, అట్టివారికిని సంబంధ ముండదు. మఱుక్షణముననే గెంటివేయబడుదురు.

ఇట్టి సంఘాద్య నియమములతో నియమింపబడిన సీ దళమునకు ప్రవేశించునపు డా సేవకులలో ప్రతియొక్కడును ఈ క్రిందనిర్ణయించిన ప్రమాణసూత్రములను ప్రతిజ్ఞాపూర్వకముగ శిరసావహింపవలసినదే.

ప్రమాణసూత్రము:—

(1) ఈశ్వరుని యెడ, జాతియెడ, జన్మభూమిపట్ల భక్తిప్రపత్తులను నెఱపుటకై నేను స్వచ్ఛంద సేవకుడ నగుచున్నాను.

(2) ఈ సంఘనియమముల ప్రకారము నేను సర్వదా దార్జన్యరాహిత్యము నే యవలంబింతును.

(3) నేను ఏవిధమైన ప్రతిఫలమును గోరకయే, కోరకుండ నుండుటకే యీ సంస్థయందు ప్రవేశించుచున్నాను.

(4) భయసంశయములను విడచి యెట్టి త్యాగమును చేయుటకైనను వెనుదీయను.

(5) నిష్కల్మష హృదయుడనై నిష్కల్మష జీవితము నే నెఱపుదును.

ఎట్టి నిష్కల్మష కార్య మొనర్చుచున్నను తమ కేదో యెసరు పెట్టుచున్నట్లు అనుమానపడి, కలియద్రొక్కొని కంగారుపడి, సత్యమును పరికింపలేక చేనిఁబోపడ్డ గ్రుడ్డెద్దుల వంటివారగు తమ తాబేదారుల కపటపు బలుకులనేనమ్మి యెంతటి యక్రమమునకైనను అన్యాయమునకైనను వెను

దీయుని దొరతనము, ఈ స్వచ్ఛంద సేవకులపై అమానుష ముగా విఱుచుకు పడినదని నుడివిన యాశ్చర్య మొందువా రుండరు. ఆ సేవకులపై కాల్చిన కాల్పులు, జరపిన లాఠీ దండయాత్రలు లెక్కింపలేము. ఆ నిరంకుశచర్యలే దాని పురోభివృద్ధికి హేతువులైనవి. అంతేకాని యీ మహన్మాత్రము కూడ చలింపచేయ లేకపోయినవి. ఖానుసాహేబు నిరంతర కృషివలన 1930 సంవత్సరమునాటి కైదువందల సేవకులతో నున్న యీసంఘు మనతికాలములోనే కొన్నిరెట్లుగ యభి వృద్ధినొందిన దొరతనమువారి కఠినప్రవర్తనకు, దండనకు తట్టుకొని ముక్కాకల నారితేరి యజేయమైనది.

ఒక్క యధర్మపూర్వక మగు విషాదఘట్టమును సూచించి యీ ప్రకరణము నింతటితో జాలింతము. ఈ స్వచ్ఛందసేవకులపై నిరంకుశాధికారు లధికారరీత్యా దౌర్జన్య రూపకంబగు దోషము నారోపించినారు. 1930 నుండి 33 వఱకు ఈ రెడ్ షర్టు వాలంటీరుదళము దౌర్జన్య మొకించుక యెచటనైనసాగించు నట్లుగా నా నిరంకుశాధికారులు ముప్పు తిప్పలుపడికూడా స్వల్ప నిదర్శనమైనను జూపలేకపోయిరి. 1930 లో పెషావరునందు నడచిన రక్తపాతఘట్టములను అధికార—అనధికారులతో నిండిన కమిటీలు విచారణలు సాగించినవి, అందుగూడ నొక్క స్వల్పాంశముకూడ చూప

బడలేదు. కాని పెషావరు రాష్ట్రమున నప్పటి కధికారములో
నున్న ఛీఫ్ కమిషనరు ఆరోపింపగలిగిన యంశము మాత్ర
మొక్కటిగలదు రెడ్ షర్టువాలంటీరు దళము ఈశ్వర సేవకుల
మని పైకి చెప్పుకొన్నను వారందరును గాంధీసేవకులే.
వారిప్రబోధము—సేవ అంతయు బోల్షివిక్ రాజ్యములోని
వాతావరణమునే సృష్టికరించును.

---

## ౭

## అసత్యదోషారోపణము

"హ్రీరమ్యుం జడుగాక సువ్రతుని మాయింగా శుచిన్ దంభిగా
శూరున్ నిర్దయుగా మునిన్ విమతిగా శ్రోత్రప్రియాలాపు ని
స్సారుంగా బలవంతు గర్వితునిగా సద్వక్త వాచాలుగా
క్రూరుండెన్ని సుధీగుణంబు దురితాకూపంబు జేయుంగదా!"

స్వాతంత్ర్యరథమును అహింసయను త్రాటి నాధార
ముగా గమ్యస్థానమునకు గొంపోవు దేశారాధకులపై నిరంకుశ
ప్రభుత్వము నెఱపిన అత్యాచారాలు, వారిపట్ల చూపిన
దమననీతిని, ఉన్నదున్నట్లుగానే వ్రాయవలసివస్తే యొక

మహాభారతమే అవుతుంది. కాని కొంతైనా చెప్పకోకుండా ఉండలేముగదా? దేశసేవకులందరియందువలెనే యీ ఈశ్వర సేవకులపైనగూడ నిరంకుశప్రభుత్వము విఱుచుకుపడి ఆపఠానులమీద క్రుమ్మరించిన భయంకరకార్యవర్షము, పెట్టిన భంగపాటులు అసంఖ్యాకములు. అందులో లెక్కకు లేనన్ని అసత్యప్రచారాలు. ఈసేవకులు జైలునుండి. విడుదలకాగోరి క్షమాపణ లిచ్చినట్లు రికార్డుపుట్టించడం మొదలైన వెన్నో ఉన్నాయి. వాని నన్నిటినీ త్రవ్వము. ఒకప్పుడు క్షమార్పణము కంటె నెన్నోరెట్లు తక్కువైన పరాభవమగు ధరావతు చెల్లించుటకే ప్రాణములను విడనాడ సంకల్పించిన పఠానులు క్షమార్పణ యిచ్చారని అవివేకు లెవరో అన్నప్పటికీ మూఢులైనవారుకూడ నమ్మరు.

అయితే వారిమీద సక్రమంగా మోపిన నేరాలుగా చెప్పే విషయాలలో ముఖ్యమైనవి, కొంతమంది పోలీసుమండలాధికారులను భంగపఱచి బండబూతులు తిట్టారని, వారి కార్లమీద రాళ్ళు-రప్పలు, పేడ-ఇంకా ఎన్నో అపరిశుద్ధపదార్థాలు విసిరారని, ఆపనులు చేసి వాని కోహాట్ వద్ద కాల్పులు కాల్చేటట్లుగా చేశారనిన్ని. ఈ అభియోగాలను మోపడంలో డాక్టర్ ఖాన్ మినహాయించి కేవలం గఫ్ఫార్ ఖానును, ఆతనిఅనుయాయులగు స్వచ్ఛందసేవకులపైనా మోపారు. అసలు డాక్టర్ ఖానుసాహేబు అపరాధమేమైనా

ఉంటారంటే అది గఫ్ఫార్‌ఖానుకు సోదరుడై ఉండుటే. ఇంక గఫ్ఫార్‌ఖానుపై మోపిన నేరాలను పరిశీలించుదాం.

(1) గఫ్ఫార్‌ఖాను రౌండుటేబులు కాన్ఫరెన్సుకు మహాత్మాజీ వెళ్ళినప్పుడు కాంగ్రెసు వర్కింగ్ కమిటీ ఆదేశాన్ని శిరసావహించి ఆ సూబా మండలములలో కాంగ్రెసు ఉద్యమ ప్రచారము చేయుట.

(2) పత్రికాముఖాల్లో ప్రభుత్వనిషేధాజ్ఞల నుల్లంఘించి ప్రచారము చేయుట—పవిత్ర వారము పేరిట మసీదులలో రాజకీయోపన్యాసము లిచ్చుట.

(3) సర్కారువారి కాలువలలోని నీటిని వాడుకోవద్దని, దానికిచ్చే భూమిశిస్తు నీటితీరువాయి పన్ను ఈయవద్దని బోధించుట.

(4) ఎఱ్ఱచొక్కాలసంఘం ఒక గొప్ప విప్లవసంఘమని, ఖానుసాహెబు నాయకత్వాన ఈ ముఠా బ్రిటిషువారిని భారతదేశాన్నుండి బలవంతముగా తరిమివేయుటకు సరిహద్దు పరగణాలలో ప్రచారము సల్పుచున్నదని.

(5) పెషావరులోని కాంగ్రెసు ప్రచారము మొహమండ్ పరగణాలకుకూడా ఆక్రమించుచున్నదని, దానికి ఈ విప్లవసంఘమే దోహదమిచ్చుచున్నదని.

(6) బ్రిటిషుప్రధానమంత్రి 1931 లో చేసిన ప్రకటనను కాంగ్రెసు ప్రావిన్సియల్ కమిటీ నిరసించి భారతస్వాతంత్ర్యతీర్మానమును పునరుద్ఘాటించుట, ఖాన్ సోదరులు ఛీఫ్ కమీషనరు దర్బారునకు రావలసినదని తమకంపిన యాజ్ఞను తిరస్కరించుట.

(7) పైకి దౌర్జన్యరహితముగా ముఖ్యప్రచారము చేయుచున్నను లోలోపల ఏదో విపరీత సంఘటనను కల్పించి తద్ద్వారా మైకమత్యము నార్జించి స్వాతంత్ర్యసమరమును దౌర్జన్యముతో సాగించుటకు ప్రజలలో నుద్దేశము కలుగ జేయుట.

(8) అన్నిచోట్ల యిప్పుడు జరిగే సంధి తాత్కాలికమే యని ప్రచారము సేయుట.

(9) మీరట్‌లో కాంగ్రెస్ విషయకమైన నొక మహాసభలో గఫ్ఫూర్ ఖాన్ భారత దేశమునుండి బ్రిటిషు వారిని బలవంతముగా సాగనపుంటే లక్ష్యముగా పెట్టుకొన్న కాంగ్రెసులో దానిని బలపఱచి యందు జయమందుటకే చేరితి నని చెప్పుట.

(10) ఈశ్వర సేవకులు సరిహద్దుపరగణాలలో చాలా చోట్ల పంచాయితీసభ లేర్పాటుగావించి యందులో కేసులు

పెట్టి తీర్పుల నమలుపరచుచు క్రమముగా ప్రభుత్వన్యాయ స్థానాలను బహిష్కరింప ప్రజలను ప్రోత్సాహించుచు నాకే సులలోతాము సాక్ష్యముల నిచ్చుటకు నిరాకరింపుచు పూర్తిగా లా శాఖను వశపఱచుకొనజూచుట.

వీనిలో గఫూర్ ఖాను 1, 6, 8, 9 ఆరోపణలను సగౌరవముగా నంగీకరించెను. నిజముగా నీనేరములు సల్పిన వారు లేకపోలేదు. వారు దొరతనమువారికొలువులోని అధికారుల ప్రాపకముచే స్వేచ్ఛగా బయటనే యుండిరి. వారికేవియు నిషేధవుటుత్తరువులు లేనేలేవు. ఇంకమూడవ ఆరోపణ విషయంలో ఖానుసాహేబు కొన్నిచోట్ల సందర్భమును బట్టియు, కాంగ్రెసు ఆదేశమును బురస్కరించుకొనియు పన్నులనిరాకరణ బోధించినది నిజమే. కాని యాకాలమునకు తన్నిరాకరణోద్యమ మమలులోనికి రానేలేదు. అంతేగాక దొరతన మారోపించిన విధముగాగాక నతడు పంటలుపాడై పోలముయజమానులు పన్నులు చెల్లింపలేని దురవస్థసమయములో నుద్బోధించుట యథార్థము. తానుమాత్ర మట్టిస్థితిలో నుండియు పన్నులు చెల్లించియే యున్నాడు ఇంక 2, 4, 5 నేరారోపణలు కేవలమన్యాయముగా నతనిని చిక్కులు పెట్టుటకు అధికారులు అక్రమముగా బనాయించినవే.

వానినిగూర్చి గఫూర్ ఖాన్ ఇట్లు ప్రకటించెను. నన్ను దొరతనము బంధించుట కవకాశము సాధారణచట్టమే యిచ్చుచున్నది. నేను సర్వదా దౌర్జన్య ప్రచారమే చేయు

టగాని దానిమీద సుముఖత చూపుటగాని జరిగియే యుండిన యెడల నాయుద్యమము కేవలదౌర్జన్యపూరితమే అయియుండెడిది. పదవ నేరారోపణ నిజమైన దేశసేవకునకు ఘనతనే కూర్చును. ఆయుద్యమము యెంత సహృదయముతో నిర్వహింపబడినదో, ఈశ్వర సేవకు లెంత పట్టుదలతో కొనసాగించిరో, ఋజువుపఱచుచున్నది. ఇంక 9 వ నేరారోపణను గూర్చి పరిశీలింతము. ఆతడు మీరట్‌లోను, సరిహద్దు రాష్ట్రము లోను కొన్ని ఉపన్యాసములు నిచ్చియున్నాడు. మీరట్ ఉపన్యాసములో నతడొసంగిన ఉపన్యాసాంశముల కును అధికారు లనువదించి ప్రకటించిన యంశములకును ఒక్క యంశమునగూడ పోలిక లేదు. సరిగదా మీదుమిక్కిలి అసభ్యతతో నిండియుండి దొరతనమువారి [illegible] నెట్లు వెల్లడించుచున్నవో చూతము.

'నాశరీరమున ప్రాణవాయువు యున్నంతవఱకు బ్రిటిషువారీ దేశము నేలకుండ జేయుటయే నాపరమ లక్ష్యము. దేవునిదయవలన నందు విజయమంది తీరుదును. నేను కాంగ్రెసులో చేరినంతమాత్రమున నాప్రజలు నన్ను ముస్లింజాతికి ద్రోహమొనరించితి ననుచున్నారు. కాంగ్రెసుసంస్థ బ్రిటిషువారికి వ్యతిరేకముగా పనిచేయు శత్రుసంస్థ. పఠానులకును, కాంగ్రెసునకును బ్రిటిషుజాతి పరమశత్రువు. అందులో నేను కాంగ్రెసులో చేరి బ్రిటిషువారిపీడ వదలించుకొన నుద్దేశించితిని.

ఈ తెల్లజాతులవారి కపటవ్యూహముల కెన్నడు మనము మోసపోకూడదు. మనకు రెండే లక్ష్యములున్నవి. ఒకటి దేశదాస్య విముక్తి, రెండు పేదసాదలకు కూడుగుడ్డ లభింప జేయుట. స్వాతంత్ర్యము సంపూర్ణముగ చేకూరువఱకు మనము నిద్రపోరాదు, తుపాకులకును, బాంబులకును నీవు బూడిద యయినను నగుగాక, మరేమియు ముంచుకొని పోలేదు. పౌరుషమున్నది నీకుండెనేని యుద్ధరంగమునకు తయారై నీబాధలకు ఆదికారణమైన యింగ్లీషువారిని ప్రతిఘటించి పోరాడుము.’

ఇంక సంధివిషయకమైన 8 వ ఆరోపణ కొంచెము పరికింతము. ఆసంధిపేరు చెప్పిన అధికారులకడుపులు మండు చున్నవి. అందు ప్రత్యేకముగా సరిహద్దురాష్ట్రపు టుద్యోగీయులకే, అయితే నిజదృష్టితో పరికిస్తే అసలు దొరతనము వారి ఆరాటము రెడ్ షర్టు వాలంటీరుదళము దౌర్జన్యమునకు దిగిందనిగాని, ఖానుసాహేబు దౌర్జన్యప్రచారం చేసాడని గాని, కాదు తాము ఎఱ్ఱచొక్కాలవారందను పెట్టినబాధలు కూడా వారిలో దౌర్జన్యరాహిత్యమునే ప్రోదిచేసినవనియు, వారు నిజమైన ఈశ్వరసేవకులు, గాంధీసేవకులునై సరిహద్దు గాంధీయని పిలువబడిన గఫూర్ ఖాన్ గుప్పిటలో శాంతముగ నిలిచి యున్నారనియు ఇది ముమ్మాటికిని సత్యము ! యథార్థము ! నిశ్చయము.

## అహింసాసిద్ధాంతము—అభిశంసన.

"హరిచరణాబ్జయుగ్మమున సంచితభక్తి మనంబులో జరా
మరణభయంబు బాంధవసమూజముపై నస్పృహలేమి దుస్సహా
స్మరశరనిగ్రహంబు ముని మాన్యవివిక్తవనప్రదేశముల్
పరమవిరక్తియుం గలుగభాగ్యమహోన్నతి వేఁడియున్నదే"

మహాత్ముఁడు భారతదేశదాస్యమును బాప సమకట్టి యవలంబించిన కార్యసాధనములలో ప్రధానమైనది అహింసా వ్రతము. ఒకప్పుడు పంజాబులో నున్నతోద్యోగిగ నుండి జలియన్‌వాలాబాగ్ దురంతములను జరిపించి నసర్ మైకేల్ సాహేబు చేసినపని వెనుకటిప్రకరణమున వివరింప బడిన నేరములకు అతనికి విధించిన శిక్ష చాలదని యతనిపై మఱికొన్ని నేరములారోపించుచు ఖానుసాహేబు నాక్షేపించుచు, దొరతనము వారిని విద్రోహులకు నియమితస్వేచ్ఛను గల్గించినందులకు నిందించెను. ఓడయ్యేరాప్రాతలో గాంధిగారి యహింసాసిద్ధాంతమును నప్పువాడు. బ్రిటిషువారి నిండి యానుండి సాగనంపు ప్రచారము బహిరంగముగా సాగించుచున్నను, సరిహద్దు రాష్ట్రమున బోల్షివిజము స్థాపింప నుంకించుచున్నను గఫూర్‌ఖానును సరిహద్దు గాంధి యనిపిలుచుచుండిరని, మనశత్రువులైన సరిహద్దుజాతులతో సంబంధము గలిగియున్నాడని, ఈమధ్యను కొంతకాలము

క్రిందట సరిహద్దు రాష్ట్రివాసులలోని కొందఱను రెచ్చగొట్టి పెషావరును ముట్టడింపజూచినవాడగు తురంగజాయి ఖానులకు దగ్గరబంధువని కారుకూతలు కూసినారు. ఇందలి యాథార్థ్యమేమన ఖానును అకారణశత్రువుగ నెంచి సంచరించు ఓడయ్యరుకు-ఖానుకు ఎంతసంబంధమో తురంగజాయితోకూడ నట్టే. వారిద్దరు సమీపగ్రామవాసులు. హాజీ తురంగజాయి మొదట సాంఘికసేవచేయ పాఠశాలలను స్థాపించి పదిమందిలో మెలగజొచ్చెను. అప్పుడు జాతీయవిద్యామార్గదర్శకుడైన హాజీతో ఖాన్‌కు మైత్రి గలిసెను. పిదప గొంతకాలమున కాహాజీ యీరాష్ట్రములో పెద్దపేరు ప్రతిష్టలనార్జించి, పలుకుబడిని సంపాదించి తీవ్రమైనవిప్లవమును పురికొల్పి దుండగముల జేయగంకగెను. హాజీ స్థాపించిన పాఠశాలలు రూపుమాపబడినవి. ఆదేశమునుండి తరుమగొట్టబడెను. మరల నతడు స్వరాష్ట్రమునకు జేరనేలేదు. ఇంతవఱకు యథార్థము. తర్వాత అఫ్గనులు బ్రిటిషువారిపై తిరుగబడినప్పుడతడు వారికి మద్దతుగానుండెనని వినికిడి. గఫ్ఫూర్ ఖాను హాజీని ఖిలాపత్ ముహాజరీలను అఫ్గనుస్థానమునకు తరలించిన రాకపోకల సందర్భమున నొకమాఱు గలిసెనట, అప్పటినుండి ఖాన్ అతనిని జూడలేదు. వినను లేదు. దీనికి అక్రమముగ పలవలు చిలవలు గల్పించి ఓడయ్యర్ యిష్టము వచ్చినట్లు వాగినాడు.

ఖాన్ సాహేబు మహాత్ముని అహింసాసిద్ధాంతమును బహిరంగముగానే ఎగతాళి చేయుచుండి ఓసత్యువనో? నా మాటకు సిగ్గేల లేకపోయెనో! ఈవిషయమును ఖాను చేసిన ప్రకటన గమనింపదగినది. సరిహద్దురాష్ట్ర మితర రాష్ట్రముల కంటె ఘాతుకమైనదని యంగీకరింతును. ఆఘాతుకస్వభావము నరికట్టి, దౌర్జన్యమును రూపుమాపి, సాత్త్వికతను వర్ధింప జేయుటకే ఖాన్ అహింసావ్రత మవలంబించెను. అంతేకాక ఆవ్రతమే యంతటి ఘోరముల నరికట్టి శాంతింపజేయగలిగిన దని ఖాన్ హృదయపూర్వకవిశ్వాసము. హిందూదేశము సత్యాగ్రహాచరణ అమలులోనికి వచ్చుటకు పూర్వమే యెంతకాలముక్రిందనో ఖాన్ ఈ సిద్ధాంతమును కనిపెట్టి యున్నాడు. అందలి సత్యము నీక్రిందవివరింపబడిన ఖాన్ ప్రకటనవలన తేటతెల్లమగును.

'నే నవలంబించిన అహింసాసిద్ధాంతము నా కేనాడో మతవిశ్వాసముగ పరివర్తనమందినది. ఇంతకు పూర్వము నేను మహాత్ముని అహింసాసిద్ధాంతమును విశ్వసించితిని. నా రాష్ట్రములో అహింసాప్రయోగపుట పూర్వవిజయము నన్ను కృతతర అహింసావాదిగ జేసినది. దేవుడు తిన్నగా చూచినచో నా రాష్ట్ర మిక ముందెప్పుడును హింసలో అణగిడదని నా విశ్వాసము. మన పేరుప్రతిష్టల నాశన మొనర్చు రక్తపాతపూర్వకములగు కలహములవలన దౌర్జన్యస్ఖలితములు మనకు గ్రాహ్యము లగుచున్నని, మనస్వాభావమునందే వలసినంత

హింసాతత్వ ముండుటచే నహింసావ్రతావలంబన మత్యంత శుభప్రదము. పఠానుల ప్రేమప్రభావము సహృదయభరితము, తానితరులనుండి యేవిధముగ జేయుటాశించునో తా నితరుల కావిధముగ జేయవలయునని నాపఠాను సోదరులెఱుంగుదురు గాక. నేనొకప్పుడు అపజయ మందినను అందవచ్చును, నా రాష్ట్రము హింసాతరంగకల్లోలితమైనను కావచ్చును. అప్పుడది నాదురదృష్టమని తృప్తినందుదును. కాని అది తక్కిన వారందరికంటె నాప్రజలకు వలయు అహింసాసిద్ధాంతము లోని నావిశ్వాసమును చలింపజేయ లేదు.''

ఇంక ఖానును విడచి యాకుటుంబమునుగూర్చి పరిశీలింతము. ఆ కుటుంబమువారికి బ్రిటిషువారిమీద ప్రతికూల భావము లున్నవనువా రించుక కన్నులు తెఱచి పరికించిన వారియపోహలు పటాపంచలగును. డాక్టరుఖానుసాహేబు కారాగారమున కేగుటకుముందు ఆయన ఆంగ్లపత్నికిని డాక్టరు ఖానుకును ఎటువంటి ఆంగ్లేయోన్నతోద్యోగులు మిత్రులుగా నుండువారో చూతము. అప్పటిగవర్నరుసతి ప్రతిదినము డాక్టర్ ఖాన్ ఆంగ్లభార్యతో మిగుల చనవుగా నుండి ప్రతిదినము నిరువురును ఒకచోగూడి కాలమును సంతోషముగ గడపువారు. మరియు గవర్నరుకూడ డాక్టరునకు మిత్రుడుగ నుండి భాయిభాయిగా మెలగెడివారు.

డాక్టరుఖానుసాహేబు కుమారు డొకడు మెట్రిక్ ప్యాసై ఆక్స్ఫర్డులో చదువ నేగెను. అతనికిమార్గేయు,

తమ్ముని కూతురును ఆంగ్లపాఠశాలలోనే జదివిరి. సాదుల్లా ఖాను డాక్టరు మొదటిభార్యకొడుకు ఇంగ్లండులో సివిల్ ఇంజనీరింగు డిగ్రీపుచ్చుకొని వచ్చినాడు. రెండవకుమారుడు హిందూదేశమంతటా 78 దినములు నిరశనవ్రతదీక్ష బూని ప్రసిద్ధివహించిన త్యాగమూర్తి. ఇతడే ఉబేదుల్లా ఖాన్. ఇతడు త్రోళ్ళపరిశ్రమలో నేర్పు సంపాదించి యంచున్నత పదవి నొంద యింగ్లాండుకు పయనమయ్యెనుగాని పన్ను కట్టలేదని నిర్బంధింపబడెను. గఫ్ఫూర్ ఖాను పెద్దకొడుకు అబ్దుల్ గని పంచదార పరిశ్రమలో చతురత నేర్వవలయునని రెండేండ్లు ఇంగ్లండులోను, కొన్నిసంవత్సరాలు అమెరికాలోను, కాలమును గడపినాడు. ఖాన్ రెండవకొడుకు అబ్దుల్ హాలీ మొన్నటివఱకచటనే అనగా డేహరాడూన్ లో చదివినాడు. తమ్ముడుగూడ నచటనే చదువుచుండెను వీరి కాంగ్లేయులతోను. వారిప్రజలతోను శత్రుత్వమని భావించువారు యిప్పుడైన నిజము గ్రహింతురుగాక!

---



## కుటుంబైక్యనిర్బంధావాసము

"గజభుజగంబులన్ బలుఖగంబుల గట్టుట సూర్యచంద్రులన్
గజిబిజిచేసి దుర్గ్రహము క్రౌర్యము నగబళించి యేచుటల్
బుజువుగనెలా మహాత్ములు దరిద్రత వేగుటజూచియయ్యయో
నిజగతి నెంత జేసె నతినిష్ఠురదైవ మటంచు గుందుమున్."

ఈశ్వరసేవకులైన ఖానుసోదరులు తుది కారాగార శిక్షలో కాలపరిమితియే లేదు. వీరు తాము చెల్లింపవలసిన శిస్తులను చెల్లించిరి. అది సంధికాలముకూడ కాదు. నిరంకుశ ప్రభువులకు కారణముండవలయునా ? ఉడుకుబోతుపరులకు ఊహాలుండవనుకొందుమా? కేవలముప్రత్యేక కార్పణ్యముతో వీరిని పలుబాములను బెట్టిరనుటకు నిదర్శనమును పెక్కులు చూపవచ్చును. కాని యవియన్నియు పూసగ్రుచ్చినటుల చెప్పి దొరతనముమీద దోషములు చూపనిష్టము లేదు. అందువలన ప్రయోజనముకూడ లేదుగదా? అయినను ఒకటి రెండు నాతికఠినములైన యుదాహరణలనిచ్చెదము. సావకాశముగ పర్యవేక్షణ మొనరింపుడు. కొంతవఱకో, ఎంతవఱకో, సాంతముగనో ఖానుసోదరుల సత్యసంధత బుజువగును.

ఆరాష్ట్రములో మాజుల్లాఖాన్ అను ప్రముఖజమీందారు డుండెను. అతడు ఈశ్వర సేవకుడుకూడ నయ్యెను. అతనిని పన్నులు చెల్లింపలేదని నిర్బంధించి కారాగారమున నెట్టిరి. ఆయన పన్నులనిరాకరణము చేయుట నాయుద్దేశము కాదనియు పైకము చేతికి రాగానే చెల్లింతుననియు నధికారులను విన్నవించుకొనెను. ఆయన బకాయిపడ్డ రెండువేల రూపాయిలను రాబట్ట మోటారును- టాంగా-గుఱ్ఱము- మూడుగేదెలు జప్తుచేయబడినవి. అంతలో నుపేక్షింపక ఆతడు విడుదల నందినపిమ్మట పైరుపంటలను, రెండులక్షల కిమ్మతు చేయు నాయనజమీను జప్తుచేయబడెను. ఇది కేవలము దురన్యాయమునరాదా?

ఇక డాక్టరు ఖానుసాహేబు రెండవకుమారుడగు ఉబేదుల్లాఖానుపేరిట కొంతభూమి కలదు. దానికి చెల్లింపవలసినది చాలపెద్దమొత్తము. అందు మూడువంతులు పన్ను చెల్లింపబడినది. ఇక చెల్లింపవలసినదిగా మిగిలినది మూడువందలుమాత్రమే దీనిని నెపముగా గైకొని పాతపగను సాధింప నతనిని నిర్బంధించి చెరసద్దా కారాగారమున నుంచిరి. ఆజైలుపరిస్థితులు వినుటకు గూడ నేహ్యముగా నుండును. ఆజైలునందలి విపరీత పరిస్థితులనుబట్టి వానిని సహించుటకన్న పొట్టమాడ్చుకొనుటుత్తమమను నూహ అతనికి పొడగట్టెను. ఎవరికైనను నట్లే కన్పడునని చెప్పుటయు వింతకానేరదు. ఆతని శిక్షాకాల

మతిస్వల్పము. ఒక నెలపై పక్షముదినములు అతడు పరిస్థితులు సుగమము లగుపఅక నిరసనవ్రతముచేయనిశ్చయించి యధి కారులకు తెలుప వారు నిర్లక్ష్యము చేసిరి. అందుచే నా యువకుడు 33 దినములు తననిరసనవ్రతదీక్ష సాగింపవలసి వచ్చెను పిదప రెండుదినములలోనే యతనిని విడిచిపెట్టిరి. అతడు రెండుమాసములు తండ్రికడ నౌషధమును సేవించి యారోగ్యదశకు వచ్చి యటనుండి స్వగ్రామమున కేగెను ఏగుటయే తడవుగ మరల ఆర్డినెన్సుపేరిట నిర్బంధించిరి. దీనిని సమర్థించుచు నిరంకుశ ప్రభుత్వ ప్రకటనలు వెలువరింపబడి యింతకుపూర్వ మారోపింపబడిన నేరములనే ఖానుసోద రుల నెత్తిపైరుద్దిరి. అయితే అచటికి అనగా దర్బారుపిలుపు నిరసించునాటి కీదోసములు అంత భయంకరములుగా గురి తింపబడలేదు. అట్లు జరిగియుండినచో ఆర్డినెన్సు ప్రతివ్యక్తి పైన నమలుజరుపుదురని వారూహించి దర్బారుపిలుపును నిరాకరించు టబ్బురముగ నెంచరు. దొరతనమువారు కుటుం బములోని ప్రముఖుల నందరను ఆర్డినెన్సుపేరిట ఖానుసోదరు లను నిర్బంధించుట కవకాశము చిక్కెనట్లూహించిరి.

ఆర్డినెన్సు పుట్టించి యమలుజరుపుటకు దర్బారుపిలుపు నిరసించుటే కారణముగ ప్రభుత్వము చెప్పినది. దర్బారుపిలు పును గౌరవించిపోయినచో నిర్బంధింప కుందురా? అదియే సందేహము. గాంధీజీ డిసెంబరు 29 తేదీని బొంబాయివచ్చు నని గఫూరుఖానుకు తెలిసి ఆయనను గలిసికొన ప్రయాణ మంతయు సిద్ధము చేసికొనెను. డాక్టరుఖానుసాహేబును యిం

గ్లండులో చదువుకొనునపుడు మిత్రుడైన జవహార్‌లాల్ నెహ్రూపండితుడు అలహాబాదులో తనతోపాటు క్రిస్టమస్ పండుగ దినములు గడపుటకు రమ్మని యాహ్వానింపగా నతడు యాత్రప్రయాణమునకు తయారై ఉండెను. 25 వ తేదీ ఉదయమున గమ్యస్థానములకు పోవనుండిరి కాని 24 వ తేదీనిరాత్రి 11 గంటలకు ఆసోదరుల నిద్దురను వేరుతావులయందు పండుగ దినములు గడుపుదురుగాని రండని నిర్బంధించి ఆటక్ బ్రిజ్‌కు నెట్టుకొనిపోయిరి.

ఆసమయముననే డాక్టరుఖాను పెద్దకుమారుడు సీమ నుండి స్వదేశము చేరి ప్రొవిన్షియల్ కాంగ్రెసుకమిటీకి కార్యదర్శిగా నియమింపబడెను. ఆధైర్యశాలియగు సాదుల్లా ఖానునుగూడ నిర్బంధించి తండ్రులను గొంపోవు ప్రత్యేకపు రైలులో నెక్కించిరి. అప్పటికి రెండుదినములక్రిందటనే స్వగ్రామమునకు వచ్చిన డాక్టరుఖానుసాహేబుభార్యయు, పిల్లలు మున్నగు కుటుంబమంతయు నొకరేయి గాఢనిద్రలో నుండు సమయమున పోలీసువారు యింటిసోదాకై వచ్చి వెంటనే యిల్లు కాళీచేయవలసినదని హంగామాచేసిరి. డాక్టరు ఖానుసాహేబు రెండవకుమారుడగు ఉబేదుల్లాఖాను నప్పుడే నిర్బంధించిరి. పాపమాత డింకను పూర్తిగ శరీరారోగ్యము కోలుకొనలేదు. తండ్రులను, బిడ్డలను ఒకేసమయముననే నిర్బంధించినను వారిలో యేయిరువురనుగాని కలిపి యొకే జైలుననుంచుట కిష్టపడక డాక్టరుఖానుసాహేబునాప్రత్యేపు

రైలుబండిలోనే అలహాబాదులోని నైనీచెఱసాలకును, గఫ్రూర్ ఖానును హజారీబాగుజైలుకును, సాదుల్లాఖానును వారణాసిజైలుకును గొంపోయిరి. ఆ రాష్ట్రప్రజల ఆందోళన ఫలితముగ నందఱిని ఒక్కచోటికి జేర్చిరి. ఏమైననేమి? కుటుంబమంతయు కారాగారములందే ప్రొద్దువలసి వచ్చెను.

ఉబేదుల్లాఖాను నిరశనవ్రతమవలంబించెను. ఆ సమయమున నతడు మృత్యుద్వారమును చేరనున్నాడని తెలియవచ్చినను, ఆసోదరులించుకంతైన చలింపలేదు ఖానుసోదరులశిష్ట గుణగణములు వర్ణనాతీతములు. వారనుపమానత్యాగధనులు, త్యాగజీవనులు, త్యాగమూర్తులనన్నను చాలదు. ఇది కాదనువారును లేరు. ఇట్టికష్టములనుభవించిన వ్యక్తులు వ్రేళ్ళమీద లెక్కపెట్ట గలిగినట్లుందురు. వీరిత్యాగదీక్షయు, శాశ్వతనిర్బంధము, స్వేచ్ఛాప్రవృత్తియు వారిఅనుయాయుల నందరను ప్రోత్సాహవంతులుగ జేయుటకుపకరించినది. ఏసమయమందైన వారుదౌర్జన్య ప్రోత్సాహకులుగగాని, దౌర్జన్యబోధకులుగగాని, దౌర్జన్యవాదులుగగాని యుండిరని తలకట్టంత ఆచోకీ లభించినను సట్టై కాల్చివేయ నూహించి సిద్ధముగానున్న యింగ్లీషు దొరతనమునకు హడలు పుట్టించినదదియే. స్వీయరాష్ట్ర ప్రజాసమూహముపై వారికున్న స్వాతంత్ర్యపు కీలకము వారనుభవించిన కష్టములలోను, చూపిన త్యాగములందును అంతర్గర్భితమై యున్నది.

## ౧౨

# ఉపసంహారము

ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖానుచిత్త మాత్మశుద్ధికోసమే గడంగునది - నిన్నమొన్న జాతీయమహాసభాధ్యక్షుడు కాక ముందు జవహరుపండితుడు సరిహద్దురాష్ట్రములకు సంచారమున కేగినపుడు గఫూర్ ఖాను చేసిన యపార నిర్మల శాంతిప్రపూరిత ప్రకటనపరంపర, చూపిన జాతీయధర్మప్రతిష్ఠ లోకమంతయు గమనించియుండెను. నెహ్రూయాతనిసాహసచర్య ఫలితరూపమగు సుహృద్భావ వైశిష్ట్యతవలననే యచటి పొలిటికల్ శాఖవారి దమననీతిసాగరము నుత్తరింప గలిగినాడు. ఆసంచారకాలమున నతడు చేసిన యాథార్థ్యవిలోలంబగు ప్రకటనవాగమృతము, సాహసోపేతమగు జాతీయదృష్టియు నతని లోకోత్తరమహత్త్వమును వేనోళ్ల జాటుచున్నవి. నిజముగా ఖానుసోదరులు ఈశ్వరసేవకులే యగుదురు. వారుసరిహద్దురాష్ట్రమునకు జీవగఱ్ఱలు. యావద్భారతదేశమునకు పూజనీయులు! భారతమాత పూర్వసుకృతపుణ్యరాశిస్వరూపులు, ధన్యులు.

సమాప్తము.



# నాయకుల జీవితములు

| | | |
|---|---|---|
| భూలాభాయి దేశాయి | 0 | 8 |
| సర్దార్ వల్లభాయి పటేల్ | 0 | 8 |
| విజయలక్ష్మి పండిట్ | 0 | 8 |
| ఖాన్ సోదరులు | 0 | 8 |
| అరుణా అసఫాలీ | 0 | 8 |
| ఛత్రపతి శివాజీ | 0 | 12 |
| పృధ్వీసింగ్ | 0 | 8 |
| ప్రకాశం | 0 | 8 |
| పట్టాభి | 0 | 8 |
| జయప్రకాశ్ నారాయణ | 0 | 8 |
| సుభాస్ చంద్రబోస్ (200 పేజీలు) | 1 | 0 |
| పరారీ నేతాజీ | 1 | |
| సాయిబాబా జీవిత చరిత్ర | 0 | 12 |
| రామకృష్ణ పరమహంస | 0 | 12 |
| గాంధీజీ అడుగుజాడల్లో | 10 | 0 |
| గాంధీ చరిత్ర | 2 | 4 |
| నెహ్రూ చరిత్ర | 2 | 4 |
| మౌలానా అజాద్ | 1 | 0 |
| ఆచార్య రంగా | 5 | 0 |

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి